# స్క్రాఫ్ట్ ఆర్ట్స్ గ్రీటింగ్ కార్డులు

## ఆంధ్రుల సంస్కృతి, చరిత్రలకు ప్రతిబింబాలు

### అపూర్వ కల్పన భక్తిరంజని గ్రీటింగ్ కార్డులు



శ్రీ వేంకటేశ్వరస్వామి. కనకదుర్గా ...వి. కామాక్షిదేవి త్రివర్ణ చిత్రాలతో, ...ప్రభాతం, స్తోత్రాలతో నిత్యాపారా...యణకు అనువైనవి మాత్రమేగాక, ...ంవత్సరం పొడవునా ప్రతిసందర్భంలోను ...వినియోగించడానికి వీలుగా రూపకల్పన.

నూతన దంపతులను ఆశీర్వదించ...ానికి, ప్రతి నూతన యత్నాన్ని అభి...ందించడానికి అవకాశం; ఆపదలో ...న్నవారికి ఆశలు చిగురించడానికి, ...్యాధిగ్రస్తులకు ఉపశమనం కలిగించ...ానికికూడా ఉపకరించగలవు. అనేక ...ందర్భాలలో ఉపయోగానికి వీలుగా ...నేక రకాల సందేశాలు.



సస్యలక్ష్మి

ఒక్కొక్క కార్డుకు 3 నుంచి 5 వరకు తెలుగులో సందేశాలతో తిరిగి ప్రచురణ ప్రారంభం. ఎవరికి నచ్చిన సందేశాన్ని వారు పంపించుకోడానికి అవకాశం. ఉచితంగా శాంపిల్స్ పంపలేము. ఒక్కొక్క రకానికి ఒక్కొక్కటి చొప్పున 27 కార్డులుగల "సంక్రాంతి డీలర్స్ సెట్టు" (దేశంలో వ్యాపారంకోసం ఉద్దేశించబడినవి) ధర రూ. 26.00. అదే "సంక్రాంతి స్పెషల్ సెట్టు" ధర రూ. 35/-లు. ఈ సెట్టులనుకోరే డీలర్లు, ఏ సెట్టు కావాలో వివరంగా పేర్కొంటూ, సెట్టుకు 10 రూపాయల చొప్పున అడ్వాన్స్ పంపాలి. మిగతా సొమ్ముకు మాత్రమే వి.పి.పి. పంపగలము. అడ్వాన్స్ లేనిదే ఏ సెట్టునూ పంపజాలము. సెట్టుతోపాటు ధరల జాబితాకూడా పంపగలము. మా ఏజెంట్లు ఆర్డర్లు బుక్ చేయడం ప్రారంభించారు. వారుఆలస్యమైతే డీలర్లే సరాసరి ఆర్డర్లుపంపవచ్చు. ది మోడరన్ న్యూస్ ఏజెన్సీస్ (గవర్నరుపేట, విజయవాడ-2) వారు రోజూ సాయంత్రం 6 నుంచి 9 గంటలవరకు ఆర్డర్లు బుక్ చేయగలరు. ఆర్డర్లు ఇవ్వదలుచుకొనే డీలర్లు వారిని కలుసుకోవచ్చు.

*మాకు ఎక్కడా డిస్ట్రిబ్యూటర్లులేరు—ఉండబోరు. పరిమితంగా మాత్రమే కార్డులు ప్రచురించబడుతున్నవి. కాగా, ముందుగా ఆర్డరు ఇవ్వనిదే ఎవ్వరికీ మేము కార్డులను సప్లయి చేయబోము.*

### సంక్రాంతి• ఉగాది• న్యూ ఇయర్• ప్రజెంటేషన్• థాంక్యూ కార్డులు: మృదుమధుర భావాలతో తెలుగు, ఇంగ్లీషు సందేశాలు



చైత్రలక్ష్మి

...లవారు

...గాకే వ్రాయాలి.



**Cards Crafts Classics**

"Rangam Bros." Buildings
13/1 General Patters Road
Post Box No. 2421 MADRAS-2
Grams: "CARDCRAFTS"

*For overseas enquiries:*

**SCRIPT ARTS**

8 State Bank Street
Post Box No. 2248
MADRAS 600 002 INDIA
Cables: "SCRIPTARTS"
Phones: 85103 81 2208



క్రొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

## శుద్ధిచేసినది.
## వాసనలేనిది.

అమృతాంజన్ ఆముదము
సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి
మరో విశిష్ఠమైన ఉత్పత్తి.

అమృతాంజన్ ఆముదము






మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలీ
100 మిలీ
200 మిలీ

OBM 3270 TG

లోకం పోకడ — ఊమెన్




ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]

శుక్రవారం : 3-12-'76
నలనామ సం. మార్గశిర శు. ద్వాదశి
సంపుటము 70 : సంచిక 14

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003

## విషయానుక్రమణిక




## ఫాలాక్ష్ని డైరీ

పత్రిక చేతికి రాగానే నేను మొట్ట మొదటి చూచే శీర్షిక "ఫాలాక్షుని డైరీ". అవి చదువుతూ ఉంటే నిజంగా జరిగినవా అని ఆశ్చర్య పరుస్తుంది. ఏది ఏమయిన ఈ శీర్షిక గురించే మీ పత్రిక కొంటున్నాను అంటే మీరు నమ్మగలరా?

తీక బాబూరావు, (కోరాపుట్-ఒరిస్సా.)

## రోజంతా చూసినా...

19.11.76 వ తేది ప్రచురించిన ఆంధ్ర సచిత్రవార పత్రిక ముఖచిత్రం అయిన ముస్తఫా మోహన్ ఛాయచిత్రంను చూచిన వెంటనే ఎన్నడు లేని ఆనందముతో ఉప్పొంగి పోయాను. నేను రోజంతా చూచినా నాకు తనివి తీరలేదు. ఈ వారం ప్రచురించిన కిటికీ కావాక్షి, నల్లగులాబి కథలు చాల చక్కగా మరియు ఆసక్తికరంగా ఉన్నాయి.

కె. . బాలసుబ్రహ్మణ్యం, (తిరుపతి)

* * *

29.10.76 తేదీగల దీపావళి సంచిక ముఖ చిత్రం "దీపసుందరి అరుణాఇరానీ" ని పదే పదే చూడాలనిపించింది. పెద్ద కథ "మజిలీ" ముగింపు బాగుంది. ఇన్సూరెన్సు చేసి ఆత్మహత్య చేసుకొన్న సందర్భాలలో కూడా ఇన్సూరెన్సు కంపెనీవారు ఇన్సూరు చేసిన సొమ్ము ఇస్తారని ఈ కథ చదివింతర్వాతే తెలిసింది. పెద్ద కథక్కూడా "జరిగిన కథ" క్లుప్తంగా వేస్తే బాగుంటుంది.

బి. వి. ఆర్. ప్రసాద్ (భీమవరం)

* *

ఈ వారం (22.10.76) పత్రిక "వాణిశ్రీ" ముఖచిత్రంతో అత్యంత శోభాయమానంగా వెలువడింది. "నేను రచయితను కాను" కథ బాగుంది. శ్రీనివాస్‌గారి సినిమా శీర్షిక వండర్‌ఫుల్ నఫీజుద్దీన్‌గారి, "మన సినిమాలలో తెలుగు భాష." వ్యాసం చాలా బాగుంది. రామలక్ష్మిగారి జవాబులు ఘాటుగా ఉంటున్నాయి.

వెంపలి వెంకటశివప్రసాద్. (ఖర్గపూర్.)

## కథలు

(29.10.76) దీప సుందరి ముఖచిత్రంతో వెలువడిన మీ (మా) ఆంధ్రపత్రిక ముఖచిత్రం వెరైటీగా వుంది. ఎవరి స్వార్థం వారు ఇంకొకరి సహాయంతో తీర్చుకొంటారన్న నిజాన్ని ఈ వారంతో ముగిసిన "మజిలీ" పెద్దకథలో రామచంద్రమవుళిగారు తెలిపారు. వారికి నా అభినందనలు. దీపావళి కథలలో మొదటి రెండు కథలు (నరిత కథ, గొడుగు) బహుమతికి యోగ్యమయినవి కావు. "ఫొటో" కథ బహుమతికి యోగ్యమైనదిగా ఉన్నది. ఎక్కువ పేజీలతో పత్రికను అందించినందుకు సంపాదకులకు నా అభినందనలు.

పోగుల పాండురంగారావు, (వల్లభరావుపాలెం)

## సీరియల్

సీరియల్స్ రెండూ చాలా ఉత్సాహప్రదంగా నడుస్తున్నాయి. 12-11-76లో కంపోకద (ఉమెన్ కార్న్యాన్) చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది. కథలు రెండూ చదవటానికి ఫరవాలేదనిపించాయి. ఏమైనా "ది సర్వీస్, రెండర్డ్ బై యూ, ఈజ్ ప్రైజ్ వర్థీ" అని చెప్పలేకుండా వుండలేను. నేనున్న ఈ బహుదూర ప్రాంతానికి సకాలములో మీ (మా) పత్రిక చేరనందుకు చింతిస్తూయున్నాను.

పక్కిగోపాలకృష్ణపట్నాయక్ (బపుధ్‌రాజ్, ఒరిస్సా)

(50వ పేజీ చూడండి)

## శ్రీ వేటూరి, త్రిపురనేని సన్మానం

యోగంతో చిత్తాన్ని, పదశాస్త్రంతో భాషను, వైద్యశాస్త్రంతో దేహాన్ని పరిపూతం చేసిన పతంజలి వంటి మహనీయులు వేటూరి ప్రభాకరులు. భాషా సాహిత్య చరిత్ర పురాతత్త్వ శాసన ఖగోళ, వైద్య యోగ శాస్త్రాలలో గంభీరమైన లోచూపుతో, దైవికమైన ఉపజ్ఞతో కలం పట్టినప్పుడెల్లా కలకాలం నిలిచే కటిక సత్యాలు వ్రాసిన నిష్పాగరిష్ఠులు. కృత్రిమమైన సంఘ మర్యాదలను పటాపంచలు చేసిన సంఘ సంస్కర్తలు. ఏడుకొండలవాని సన్నిధికి హరిజనులను తొలిసారిగా వెంటబెట్టుకొని వెళ్ళిన "చండాలోస్తు సతు ద్విజోస్తు భవతి వ్యాస మనీషామమ" అన్న శంకరులు వేటూరివారు. వేటూరివారు అటునుంచి రాగా, ఇటునుండి పైకి వెళ్ళిన వారు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. అసమాన సాహసం, సంఘాన్ని మూఢ విశ్వాస నివారణం చేసి చైతన్యవంతం చేయాలనే తపన, అసహజమైన వ్యవస్థపైనే గాని వ్యక్తి పైన కోపం లేని అసిధారావ్రతం మూర్తీకట్టిన వారు చౌదరిగారు. ఈ మహనీయులిద్దరి సంస్మరణ సభను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అక్టోబర్ 31 వ తేదీన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో నిర్వాహం చేసింది. ఇరువురితోను పరిచయమున్న, క్షీరనీరన్యాయాన్ని పూర్తిగా జీవితంలో అనుసంధానం చేస్తున్న న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ఈ సభను నిర్వహించడం ఎంతో ఔచిత్యయుతమయింది. శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగతవచనాం తర్వాత, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అకాడెమీ పథకాన్ని వివరించిన పిమ్మట అన్నిటా వేటూరి వారి అంతేవాసి విద్వాంసుడు శ్రీ సింగరాజు సచ్చిదానందం ప్రభాకరశాస్త్రి సమగ్ర మూర్తిని గురించి సాహిత్య సాంఘిక రాజకీయాది ఉద్యమ ప్రవంతుల ఆకళింపుతో, ఏది వ్రాసినా, ఏది చెప్పినా సమన్వయ శీలంతో ప్రామాణికతను పాటించే డాక్టర్ అమరేంద్ర త్రిపురనేని వారి సమగ్ర మూర్తిని గురించి ప్రసంగించారు. డాక్టర్ బోయి భీమన్న కృతజ్ఞతలు చెప్పారు.

## శ్రీ వికా యాదగిరిరావు శిల్పాలు

కొందరు చిత్రకారులు తుక్కుడుదాగర వస్తు

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

వుగా వర్ణచిత్ర కళాఖండాలు సృష్టిస్తే శ్రీ ఎక్కా యాదగిరిరావు ఇనుపరేకులు, ముక్కలు అతికించి సమసామయిక ఇతివృత్తం ధ్వనించే అపూర్వ కళాఖండాలు సృష్టిస్తారు. 'హిందూమహా సముద్రంలో మాకు శాంతి కావాలి'' అనే శీర్షికతో ఆయన పోతపోసిన మత్స్య విగ్రహం ఒక ఖండ కవితగా భావుకులను ఆనందపరచడమే కాక రాజనీతిజ్ఞులకు కూడా ప్రశంసాపాత్రమయింది. అలాటిది సువర్ణ పతకం పొందడంలో ఆశ్చర్యం లేదు. నిరుడు ప్రపంచ తెలుగుమహా సభలో ప్రముఖ శిల్పిగా సన్మానం పొందిన యాదగిరిరావు పెక్కు ప్రదర్శనలు జరిపి తెలుగువారి కీర్తిని విస్తరింపజేశారు. ఈయన శిల్పఖండాలు పెక్కు సాలార్‌జంగ్ మ్యూజియం, ఢిల్లీలోని జాతీయ ఆధునిక కళా మ్యూజియం, మాస్కోలోని అంతర్జాతీయ సాంస్కృతిక మ్యూజియంలలోను, ఇతర సంస్థలలోను ఉన్నాయి. ఆయన అక్టోబర్ చివరి వారంలో కళాభవన్‌లో సరికొత్త శిల్పాలు ప్రదర్శించారు. మునిసిపల్ కార్పొరేషను స్పెషల్ ఆఫీసరు శ్రీ నరేంద్రలూథర్ ప్రారంభోత్సవం చేశారు. హైదరాబాద్ ఆర్ట్స్ సొసైటీ యాజమాన్యాన ఈ ప్రదర్శనం జరిగింది.

## నగర సుందరీకరణం

జంటనగరాల సుందరీకరణం పై మునిసిపల్ కార్పొరేషను ప్రత్యేకాధికారి శ్రీ నరేంద్రలూథర్ నవంబర్ 5వ తేదీన పత్రికా రచయితల గోష్ఠిలో వివరించారు. కుష్ఠురోగి బిచ్చగాళ్లను కూకట్‌పల్లికి తరలిస్తారట. జంటనగరాలలో పదివేల మంది బిచ్చగాళ్లున్నారని వీరిలో వేయి మంది కుష్ఠురోగులని వారిని భిక్షుక గృహాలకు తరలిస్తామని అన్నారు. మేడిబాయిబస్తీ, నారాయణనగర్, ఫతేసుల్తాన్‌లేన్, జేదాబాగ్, కంచన్‌బాగ్, రామారావునగర్ అనే మురికి వాడలలో ప్రస్తుతం 1200 ఇళ్ళు కడుతున్నారు. క్రమంగా తక్కిన మురికి వాడలలో కడతారు. ముఖ్యమైన 44 రోడ్ల విస్తీర్ణ కార్యక్రమం ప్రారంభమవుతుంది. దిగువ టాంక్‌బండ్ రోడ్డును వెడల్పు చేస్తారు. కాలిబాటలు లేని చోట కనీసం ఒక వైపైనా కాలిబాటలు వేస్తారు. రవాణా సంస్థలన్నిటినీ ఆరు మాసాలలోగా విజయవాడ రోడ్డులోని ఆటోనగర్‌కు తరలిస్తారు. బొంబాయి రోడ్డులోను మరొక ఆటోనగర్ నిర్మిస్తారు. టాంక్‌బండ్ దిగువన వున్న ఇందిరా నేషనల్ పార్కును రెండు మూడు నెలలలో తెరుస్తారు.

## మార్వాడీ మహాసభ

మార్వాడీలకు, మనకు జైన వైష్ణవ మత వ్యాప్తితో సన్నిహిత సంబంధం ప్రారంభమయింది. ఎక్కడికి వెళ్లినా కలిసి పోయి వాణిజ్య వ్యాపారాలతో వేళ్ళు తన్నుకొనే వర్గం మార్వాడీలు. ఎంత కరకుగా డబ్బు గుంజుతారో, అంత విసురుగా తాము నమ్మిన ధర్మకార్యాలకు డబ్బు కుమ్మరించే తెగువ గలవారు మార్వాడీలు. పట్టువిడుపులు చేతనైన గట్టి తెగ. వారివల్ల తెలుగు ప్రాంతం ఎన్నో విధాల అభివృద్ధి చెందిందనడం కాదనరాని మాట. దీనికి పత్రికలు, సంస్థలు ఎన్నో తార్కాణం. ఈ మార్వాడీల అఖిల భారత సమాఖ్య పదకొండవ మహాసభలు నవంబర్ 6, 7, 8 తేదీలలో ఎగ్జిబిషన్ మైదానంలో గొప్పగా జరిగాయి. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రారంభోత్సవం జరుపుతూ మార్వాడీలు దేశ వాణిజ్య పరిశ్రమలకు చేసిన సేవను ప్రశంసిస్తూ కేవలం లాభదృష్టితో కాక సమాజ దృష్టితో, సంక్షేమ దృష్టితో ప్రవర్తించాలని కోరారు. అ[ధ్య]క్షత వహించిన శ్రీ భవర్‌మల్‌సింఘీ ధనా[ర్జనే ల]క్ష్యం కారాదని సంఘ శ్రేయస్సు చూడని వా[రిని] సంఘం మన్నించదని హెచ్చరించారు. కాలపరిస్థి[తు]లను గ్రహించి ప్రవర్తించాలని తమిళనాడు గవర్న[ర్] శ్రీ మోహన్‌లాల్‌సుఖాడియా సలహా యిచ్చా[రు.] ధనికులైన మార్వాడీలు సంక్షేమ కార్యక్రమ[ాలు] చేపట్టాలని గవర్నర్ శ్రీ భండారే సూచించా[రు.]

## రామాయణ సుధాలహరి

యువభారతివారు ఏర్పాటు చేసిన రామాయ[ణ] సుధాలహరి ఉపన్యాస పరంపరలో 8వ తేదీన డాక్ట[ర్] దివాకర్ల వేంకటావధాని వాల్మీకి రామాయణం గురించి, శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి అధ్యాత్మరామాయణం గురించి ప్రసంగించారు. సమా[]వేశానికి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్ష[త] వహించారు. శ్రీ యడవల్లి శివరామశాస్త్రి ముఖ్య అతిథిగా ఉన్నారు.

## ఉ వ శ్రు తి :—

"ఏమిటి చదువుతున్నారు అంత శ్రద్ధగా" అ[ని] అడిగాను తదేక దీక్షతో పుస్తకంలో మునిగిన ఒ[క] శాస్త్రిగారిని. "ఏదో నవల లెండి!" అన్నారు ఆయన ఏదో తప్పు చేసినట్లు సంకోచపడుతూ. అక్కడే వున్న శ్రీమతి కప్పగంతుల అన్నపూర్ణమ్మ "పూర్వం నాటకాంతం సాహిత్యం అన్నారు. ఇప్పుడు నవలాంతం సాహిత్యం" అని చమత్కరించారు.



సుప్రసిద్ధ జర్నలిస్టు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు నవంబర్ 13వ తేదీ ఉదయం విజయవాడలో తమ 65వ ఏట మృతి చెందారు. ఆంధ్ర పత్రికలో 1941 నుంచి 1959 దాకా వారు పని చేశారు. నలభై సంవత్సరాలగా ఆయన పత్రికారంగంలో వుండి ఎన్నో పత్రికలకు సంపాదకత్వ బాధ్యత వహించారు. జులై 1976లో ఆంధ్ర ప్రభ సంపాదకునిగా రిటైరైనారు.

కొంత కాలంగా అస్వస్థులై వున్నప్పటికీ, వారు యిటీవల దాకా వ్యాస పరంపర కురిపిస్తూనే వున్నారు. ఆయన సేవలు పొందిన పత్రికలలో ఆంధ్ర జనత, ఆంధ్ర భూమి, ప్రజా ప్రభ, 'సంజయ' మున్నగునవి వున్నాయి. వారు షిర్డి సాయిబాబా భక్తులు. 'శ్రీపతి', 'ఆర్. ఎస్. పండిట్', 'శాంతారామ్' వారి ఒకనాటి కలం పేర్లు. చివరి క్షణాలలో వారి భార్య, యిద్దరు కుమారులు, యిరువురు కుమార్తెలూ వారి వద్దనే వున్నారు.

[★★★]

రోహిణీ కార్తె ఎండలు మండిపోతున్నాయన్న సూచనగా 'కృష్ణ నిలయం' అని వ్రాసున్న ఆ అందమైన బంగళా విశాలమైన ఆవరణలోని ఇసుక రేణువులన్నీ ఒకదాన్తో ఒకటి పోటీ పడ్తూ తళ తళా మెరుస్తున్నాయి.

# ఆమెకేం కావాలి?

బొడ్డుపల్లి గౌరీదేవి

గేటు తీసుకుని లోపలికి వచ్చిన లక్ష్మణ్ అలసటగా తన గది తలుపు తాళం తీసుకుని లోపలికి అడుగు పెట్టాడు. ఎదురుగా నిలువుటద్దంలో తన ప్రతిబింబం తనకే వికృతంగా కనిపిస్తోంది. 'రేగిన జుట్టూ, నలిగిన బట్టలూ, ఎర్రబడ్డ కళ్ళూ. 'ఓహ్! ఎండ తననెంత దెబ్బ తీసింది!' అనుకుంటూ ముఖం కడుక్కోటానికి లోపలికెళ్ళబోతున్న అతను కాస్త దూరంలో చిరుగాలికి రెపరెపలాడుతున్న పసుపు పచ్చ కవర్ని చూసి ఆగిపోయాడు. 'తను లేనప్పుడు పోస్ట్‌మాన్ తలుపు సందులో నుండి గిరవాటేసి వెళ్ళినట్లున్నాడు' అనుకుంటూ వంగి దాన్నందుకున్నాడు. కవరు మీది దస్తూరీ చూడగానే ఎవరు వ్రాసారో తెలిసిపోయింది. అసలు చూడకపోయినా అది గోపాలరావుగారి దగ్గర్నుండో లేక సంధ్య దగ్గర్నుండో అని ఠక్కున చెప్పగలడతను. ఎందుకంటే ఈ లోకంలో తనకి దగ్గరి వాళ్ళెవరైనా ఉన్నారంటే అది వాళ్ళిద్దరే! వాళ్ళ తరవాత వాళ్ళ అంతగానూ ఆదరించగల స్నేహితుడు ఉదయ్ శంకర్! వీళ్ళు ముగ్గురే తన ఆప్తవర్గమంతా.

మెదడు ఆలోచిస్తున్నా అతని చురుకైన కళ్ళు మాత్రం చక చకా, కవరులో నుండి తీసిన నీలిరంగు కాగితాన్ని చదువుకోసాగాయి.

"ప్రియమైన లక్ష్మణ్!

ప్రతిసారి లాగానే ఈసారి కూడా నా ఆరోగ్యం గురించిన జాగ్రత్తలతో నిండిన నీ ఉత్తరం అందింది. నాకు తెలుసురా నా ఆరోగ్యం గురించి అక్కడ నువ్వూ, ఇక్కడ సంధ్యా ఎంత ఆందోళన పడుతున్నారో! నాకు సాధ్యమైనంతగా నా జీవితకాలాన్ని పొడిగించుకోవాలనే ఉంది. కానీ లక్ష్మణ్! ఒకటి మాత్రం నిజం! వొత్తి ఉన్నంత వరకూ ఎన్నిసార్లైనా నూనె పోసి దీపం ఆరిపోకుండా చూడవచ్చు. కానీ వొత్తే కాలిపోతే! స్పేర్ పార్ట్స్ లు లభించేంతవరకూ మోటారు పాడైనా బాగుచేసుకోవచ్చు. కానీ అవే దొరకకపోతే అది చలనం లేకుండా పడి ఉండాల్సిందేగా! అలాగే ఉంది నా పరిస్థితి. ఎన్ని మందులు తీసుకుంటే మాత్రం ఏం ప్రయోజనం వాటిని జీర్ణించుకునే శక్తి లేకపోయాక!

లక్ష్మణ్! ఇంత ఉపోద్ఘాతమెందుకు అనుకుంటున్నావు కదూ! సరే! అసలు విషయానికొస్తాను. మొన్న మొన్నటివరకూ సంధ్య నా గురించి దిగులు పడ్తూంటే నేనే ధైర్యం చెప్తూ వచ్చాను. కానీ ఈ రోజు నాకే ఒకరు ధైర్యం చెప్పాల్సిన స్థితిలో ఉన్నాను. చావంటే భయంలేదు. నా బెంగల్లా సంధ్య గురించే! సంధ్య నాకో సమస్యై కూర్చుంది. దాని విషయం ఓసారి నీతో ముఖాముఖీ ప్రస్తావించాలని ఉంది.

నాకు తెలుసు నువ్వు ఆఫీసు పనుల్తో బిజీగా ఉంటావని! కానీ ఈ ఒక్కసారికి మాత్రం నిన్ను ఇబ్బంది పెట్టక తప్పటం లేదు. బహుశా ఈ జీవితంలో నీకు నా ఆఖరి ఉత్తరం ఇదే అవుతుందేమో కూడా! సాధ్యమైనంత త్వరగా వచ్చేస్తావు కదూ! నీ కోసం వెయ్యి కళ్లతో ఎదురు చూస్తూంటాను. ఉండనా మరి?

ఇట్లు,
నీ మామయ్య గోపాలరావు."

లక్ష్మణ్ ముఖం పాలిపోయింది. అతని కళ్లముందు గోపాలరావుగారి దీనమైన ముఖం కనిపించింది. మామయ్య! గుండె నిబ్బరమంతా అతని సొత్తేనేమో అన్నట్లుండే మామయ్య ఇంత బేలగా వ్రాసారంటే ఆయన పరిస్థితేమిటో తను సులభంగా ఊహించుకోగలడు. ఆయనే అంత డీలా పడిపోతున్నారంటే ఇక సంధ్య ఎంత దిగులుగా ఉండి ఉండాలి! సృష్టిలోని అందమంతా ఇముడ్చుకున్నట్లుండే ఆ కళ్ళు నీళ్ళతో నిండిపోతే అది తుడవాల్సిన బాధ్యత తనది కాదూ! ఎందుకు కాదు? చిన్నప్పట్నుండీ కన్నకొడుకులా పెంచి తల్లీ తండ్రీ లేని లోటు తీర్చి తననీ స్థితికి తెచ్చిన మామయ్యనీ, 'బావా, బావా!' అంటూ ఆపేక్షగా తన చుట్టూ తిరిగే సంధ్యనీ ఓదార్చవలసిన బాధ్యత తనకెంతైనా ఉంది. 'సంధ్య నాకో సమస్యై కూర్చుంది' అని వ్రాసారాయన. నిజమే! ఎదిగి వచ్చిన ఆడపిల్లల పెళ్ళిళ్ళు అవసాన దశలో ఉన్న తండ్రులకి సమస్యే! కానీ సంధ్యకా సమస్య లేదనీ, తను ఆమె బాధ్యత స్వీకరించటానికి సంసిద్ధముగా ఉన్నాడనీ తెలియచెప్పాలి. ఆయన ఋణం ఈవిధంగా తీర్చుకోగలడని కాదు. అందులో తన స్వార్థమూ లేకపోలేదు. ఆ ఓర చూపులూ, తేనె పలుకులూ కావాలి తనకి!

లక్ష్మణ్‌కి అప్పటికప్పుడు వెళ్ళి ఆయన ముందు వ్రాలి 'ఏం భయంలేదు మామయ్యా! మీకు నేనున్నాను.' అని చెప్పాలన్నంత ఆవేశం వచ్చింది. కానీ ఎలా? సెలవు దొరకుతుందా? అసలే క్రొత్త ఉద్యోగం. డ్యూటీలో జాయినయి మూడు నెలలు కూడా కాలేదు. సెలవు అడిగినా ఆఫీసరు గ్రాంట్ చెయ్యడు. ఆలోచిస్తూ చాలాసేపు నిస్త్రాణంగా కూర్చుండి పోయిన అతను చటుక్కున ఏదో తట్టిన వాడిలా లేచాడు. గబగబా బ్రీఫ్‌కేసులో రెండు జతల బట్టలు పడేసుకుని, ఇంటికి తాళం వేసుకుని బయటపడ్డాడు. మరో రెండు గంటల్లో ట్రెయిన్ ఉంది.

ఎలాగూ స్టేషన్‌కి సికిందరాబాదు వెళ్ళాలి కాబట్టి మధ్య దారిలో అక్కడే ఉన్న ఉదయ్ ఇంటి దగ్గర ఆగి, సెలవు విషయంలో అతనేమైనా చేయగలడేమో అడగాలి. తలచుకుంటే ఉదయ్ చెయ్యలేనిదేదీ లేదు. అంత పలుకుబడి ఉందతనికి. అసలు అతనిదీ, తనదీ తమాషా అయిన స్నేహం. ఇద్దరికీ అలవాట్లలో, అభిరుచులలో ఉత్తర దక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది. పైగా అతను కోటికి పడగెత్తిన ధనికుడైతే తను మామూలు మధ్య తరగతి కుటుంబీకుడు. అతని చుట్టూ ఉండే ప్రపంచం పెద్ద పెద్ద కార్లలో తెల

బొటవ్స్ వేసుకుని,రంగుటద్దాలు పెట్టుకుని జల్సాగా తిరిగే మనుష్యులు. తను అలాటి వాతావరణం అంటేనే గిట్టని వాడు. అతను మంచి పేరుగల గొప్ప డాక్టర్. తను మామూలు క్లర్కు. ఇన్ని తేడాలున్నా అవి తమ స్నేహానికి అడ్డుగోడలు కాలేదు. అయితే అంత స్నేహం ఉన్నా అతను తన గదికి రావ



టమే కాని అతనింటికి తనెప్పుడూ వెళ్ళలేదు. అతనూ పిలుచి వెళ్ళలేదు. ఇదే మొదటిసారి తనక్కడికి వెళ్ళటం! అరగంటలోనే ఉదయ్ ఇల్లు వచ్చేసింది. లక్ష్మణ్ ఊహించినట్లే అది మూడంతస్థుల పెద్ద మేడ. బయట ఆవరణలో వరసగా చాలా కార్లాగి ఉన్నాయి. లోపలేదో పార్టీ జరుగుతోంది కాబోలు కొంత మంది జనం కోలాహలంగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

లక్ష్మణ్ సంశయిస్తూనే లోపలికి నడిచాడు. దూరంగా ఆడపిల్లల మధ్య ఠీవిగా కూర్చుని నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడు తున్న ఉదయ్ అతన్ని గమనించే స్థితిలో లేడు. లక్ష్మణ్ చొరవగా అతని దగ్గరికి వెళ్ళలేక పోయాడు. పనిచేసే కుర్రాడొకడు అటుగా వస్తే తన పేరు చెప్పి ఉదయ్‌కి తనొచ్చినట్లు చెప్పమన్నాడు. ఆ అబ్బాయి వెళ్ళి "బాబుగారూ! బాబుగారూ!" అంటూ అతన్ని నాలుగైదుసార్లు పిలిచాడు కానీ పిలుపు ఉదయ్ దృష్టిని పట్టుకోలేదు.

ఐదునిముషాలు గడిచిపోయాయి. లక్ష్మణ్ క్షణక్షణానికీ అసహనం పెరిగిపోసాగింది. అప్పటికే చాలామంది బ్రీఫ్‌కేస్ పట్టుకుని వచ్చి అతని వంక విచిత్రంగా చూస్తున్నారు.

"ఉదయ్!" లాభం లేదనుకుని అసహనంగా పిలిచాడు.

ఎవర్తెనో కరచాలనం చేస్తూ నవ్వుతూ మాట్లాడుతున్న ఉదయ్ ఉలిక్కిపడిన వాడిలా ఆ పిలుపు వినిపించిన వైపు చూసి లక్ష్మణ్‌ని చూడగానే మెరిసే కళ్ళతో అతని దగ్గరికి వొచ్చాడు.

"హల్లో లక్ష్మణ్! ఏమిటిలా వచ్చావు?" అంటూ అతన్తో చెయ్యి కలిపి, "పద అలా నా రూమ్‌లోకి వెళ్ళి మాట్లాడుకుందాం." అంటూ లోపలికి తీసుకెళ్ళాడు. "ఫ్రిజ్" తెరచి కోకాకోలా తీసి అతనికిచ్చి ఎదురుగా కూర్చుంటూ, "ఇప్పుడు చెప్పు. చాలా సేపయిందా వచ్చి?" అడిగాడు.

లక్ష్మణ్ కొస్త విసుగ్గా చూసి "చాలా సేపే అయింది. వెరీ మెనీ థాంక్స్. అంత మంది అమ్మాయిల మధ్య ఉన్నా నా గొంతు వినగానే గుర్తు పట్టావు" అన్నాడు.

ఉదయ్ నవ్వాడు. "మగతనిద్రలో లేచినా నిన్ను గుర్తించగలను"

"ఏ సందర్భంగా పార్టీ ఇస్తున్నావు?" మాట మారుస్తూ అడిగాడు లక్ష్మణ్.

"నేను కాదు. ఈ రోజు మా తమ్ముడి వెడ్డింగ్ ఆనివర్శరీ. వాడే ఇస్తున్నాడు పార్టీ"

లక్ష్మణ్ కోపంగా అతని వంక చూసి, "ఎంత నిర్లిప్తంగా చెప్తున్నావు! మీ తమ్ముడికి కూడా పెళ్ళయిపోయింది. నువ్వింకా ఎందుకిలా ఉంటున్నావో నాకేం అర్థం కావటం లేదు." అన్నాడు ఖాళీ సీసా టేబుల్ మీద పెడ్తూ. ఉదయ్ నవ్వాడు. "నాకు చెప్పటం కాదు. నువ్వు ముందు చేసుకో."

"నా విషయం వేరు. మొన్నమొన్నటిదాకా నిరుద్యోగ పర్వంలోనే ఉన్నాను. ఇప్పుడిక ఏ అభ్యంతరాలూ లేవు కాబట్టి చేసుకుందామనే అనుకుంటున్నాను. నువ్వలా కాదు. ప్రాక్టీస్ పెట్టి నాలుగైదేళ్ళుగా బాగా సంపాదిస్తున్నావు. పెళ్ళి చేసుకోటానికి కావలసిన అర్హత లన్నీ ఉన్నాయి. పెళ్ళి చేసుకోనవటానికి ఆస్కారమే లేదు." లక్ష్మణ్ ఒక్క నిమిషం ఆగి, "ఈ మాటలు నేను నీతో ఇప్పటికి రెండు మూడుసార్లు అనుంటాను. కానీ నీ దగ్గర్నుండి సరైన సమాధానం లేదు, 'నేను పెళ్ళి చేసుకోను.' అనటం తప్పించి." నిష్కారంగా ఉదయ్ కళ్ళలోకి చూసాడు.

ప్రతి సారిలాగే ఆ సారి ఉదయ్ సమాధానం చెప్పకుండా నవ్వి ఊరుకున్నాడు. రెండు నిమిషాలు నిశబ్దం రాజ్యం చేసింది. దాన్ని భంగపరుస్తూ, "ఇంతకీ నువ్వు అసలు విషయం చెప్పనేలేదు. మా ఇల్లు నీ రాకతో పావనం చేశావంటే ఏదో విశేషం ఉండి ఉండాలి." చివరికి ఉదయే అన్నాడు.

"నేను ఊరికి వెళ్తున్నాను."

"అది తెలుస్తూనే ఉంది. ఏ ఊరు? ఏ పనిమీద? పెళ్ళి చూపులకి కాదు కద!" అతని కళ్ళల్లో కొంటెతనం తొంగి చూసింది.

లక్ష్మణ్ అతని పరిహాసాన్ని పట్టించుకోలేదు. "మా మామయ్యకి సీరియస్‌గా ఉందిట. సాధ్యమైనంత త్వరగా వెళ్ళాలి."

ఉదయ్ కూడా గంభీరంగా మారిపోయాడు. "ఆయనకెవరూ లేరా?" అడిగాడు.

"కొడుకులు లేరు. ఒకమ్మాయి ఉంది. పేరు సంధ్య! ఉదయ్! 'నువ్వో సాయం చేసి పెట్టగలవా?" లక్ష్మణ్ అతని కళ్ళలోకి చూసాడు.

"నువ్వడగటమూ నేను కాదనటమూ? నాకు చేతనైతే తప్పక చేసాను. ఏమిటది?" కుతూహలంగా ముందుకి వంగాడు ఉదయ్.

లక్ష్మణ్ జేబులోనుండి ఓ కాగితం పైకి తీసి, "ఇది నా సెలవు చీటీ. మా ఆఫీసర్ నీకు బాగా తెలుసన్నావు కదూ! కొత్త ఉద్యోగస్తుణ్ణి అందులోనూ క్రింది ఉద్యోగస్తుణ్ణి; నేను పరిస్థితి వివరించి అతనికి చెప్పినా అతను నమ్మి లీవ్ గ్రాంట్ చేస్తాడన్న నమ్మకంలేదు నాకు. నా తరఫున నువ్వు అతన్తో మాట్లాడి ఎలాగైనా పని అయ్యేట్లు చూడాలి. ఆయన అప్పటికీ ఒప్పుకోకపోతే నేను రాజీనామా చెయ్యటానికైనా సిద్ధమేననుకో. నాకోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూసే మామయ్యకంటే నాకీ ఉద్యోగమేం ముఖ్యమైనదికాదు. కాకపోతే చివరి ప్రయత్నంగా..." అతని మాటలు పూర్తి కాకముందే.

"అంతవరకూ రాదులే నా ఉద్దేశ్యం లక్ష్మణ్! ఎందుకంటే ఆయన్ని కన్విన్స్ చెయ్యగలనన్న ధైర్యం నాకుంది. వెంటనే ఫోన్‌చేసి చెప్తాను. సరేనా?" ఉదయ్ కాగితాన్ని భద్రంగా టేబిల్ సొరుగులో పెట్టుకుంటూ హామీ ఇస్తున్నట్లు అన్నాడు.

లక్ష్మణ్ కళ్ళు కృతజ్ఞతతో నిండిపోయాయి. "నీకెలా ధన్యవాదాలు చెప్పుకోవాలో తెలీటంలేదు ఉదయ్!" ఉదయ్ ఆ చేతితోనే అతని చేతిని ఆపేక్షగా నొక్కి "ఇంతమాత్రానికేనా? నీ ట్రెయిన్ ఎన్ని గంటలకుంది?" అడిగాడు.

లక్ష్మణ్ వాచీ చూసుకుని ఉలిక్కిపడ్డట్లు లేచి, "ఇంకో అరగంటలో ఉంది. వెళ్తాను. రిజర్వేషన్ కూడా చేయించుకోలేదు." అన్నాడు ముందుకి నడుస్తూ.

హాలులోనుండి జనాన్ని తప్పించుకుంటూ బయటికొచ్చాక, "కారు పంపనా?" అడిగాడు ఉదయ్.

"అక్కర్లేదు. నీ గరల్ ఫ్రెండ్స్‌ని డ్రాప్ చేయటానికి ఉపయోగపడుతుంది ఉంచనివ్వు." అప్రయత్నంగా అనేసిన లక్ష్మణ్ వెంటనే సిగ్గుపడి, "క్షమించు. మాటలు జారాను. కోపం వచ్చిందా?" పశ్చాత్తాపపడుతున్నట్లు అన్నాడు.

ఉదయ్ తేలిగ్గా నవ్వేసాడు. "ఫరవాలేదు. అభిమానంతో చూడిన ఆ అధికారం నాకిష్టమే."

లక్ష్మణ్ తేలికపడి, "సరే వస్తాను



స్టేషన్ దగ్గరేగా! నడిచి వెళ్లిపోతాను; నువ్వు మర్చిపోకుండా ఆయనకి చెప్తావుగా!" అంటూ బయటకి నడిచాడు.

"ష్యూర్!" వెనకనుండి ఉదయ్ స్వరం అభయమిస్తున్నట్టు వినిపించింది.

టిక్కెట్ కొనుక్కొని రైల్లో కూర్చున్న లక్ష్మణ్ గోపాలరావుగారి గురించిన ఆలోచనల్లో మునిగిపోయాడు.

*　　*　　*

"సంధ్యా!" చీకటి ఇంకా తెరలు తెరలుగా ఉండగానే ఊరు చేరుకున్న లక్ష్మణ్, ఇంట్లోకి అడుగు పెడుతూనే గుమ్మంలో దిగులుగా కూర్చున్న ఆకారాన్ని సంధ్యగా గుర్తించి పిలిచాడు. మసక వెలుతుర్లో కళ్లు చికిలించి చూసిన సంధ్య లక్ష్మణ్‌ని గుర్తుపట్టి, "ఓహ్! బావా! నువ్వింత త్వరగా వస్తావనుకోలేదు. నిజంగా ఎంత మంచి వాడివి!" దగ్గరగా పోరికేక పెట్టింది అతని రెండు భుజాల్నీ చేతుల్తో పెనవేస్తూ, లక్ష్మణ్ నవ్వి ఆమెని విడిపించుకుని, "రాకుండా ఎలా ఉండగలననుకున్నావు సంధ్యా! ఆయన విషయంలో నువ్వెంత ఆందోళన పడుతున్నావో నేనూ అంతే దిగులు పడుతున్నాను. అంతగా పాడయిందా ఆయన ఆరోగ్యం? ఎంత గాభరాగా ఉత్తరం వ్రాసారో తెలుసా?" అడిగాడు సూట్‌కేస్ గదిలో పెట్టేస్తూ. సంధ్య తల ఊపి, "రా! చూస్తే నీకే తెలుస్తుంది." అంటూ తండ్రి గదిలోకి తీసుకువెళ్ళింది.

గోపాలరావుగార్ని చూస్తూనే ఉలిక్కిపడ్డాడు లక్ష్మణ్. 'ఎలా ఉండే మామయ్య ఎలా అయిపోయారు?! పోయినసారి వచ్చినప్పుడు కూడా సుస్తీగానే ఉంది కానీ ఇంత నీరసంగా మాత్రం లేరు. యాభయ్యేళ్లకే వినష్టైపోయిన వ్యక్తిలా తయారయారంటేనే ఆయన మృత్యువుకెంత చేరువలో ఉన్నారో తెలిసిపోతోంది' అనుకోకుండా ఉండలేకపోయాడు. నిద్రపోతున్న ఆయనవంక తదేకంగా చూస్తున్న అతను.

"లేపమంటావా?" సంధ్య ప్రశ్నతో తేరుకుని.

"అహఁ! అక్కర్లేదు. ఇప్పుడంత అవసరమేముంది? పద! బయట కూర్చుని మాట్లాడుకుందాం." అంటూ బయటకొచ్చి వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. సంధ్య అతని ఎదురు కుర్చీలో కూర్చుని, "పదిహేను రోజుల క్రితం ఎప్పుడూ రానంత గుండె నొప్పితో బాధపడ్డారు బావా! నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. పక్కింటి వాళ్ల సాయంతో హాస్పిటల్‌లో చేర్పించాం. తరవాత కొంచెం తగ్గింది. నీకు టెలిగ్రాం ఇద్దామని నేనెంతగా అన్నా నాన్న వినిపించుకోలేదు. నాలుగు రోజుల క్రితం ఇంటికి వచ్చేసారు. అప్పుడెంతగా చెప్పినా వినని వాళ్ళు ఏమనుకున్నారో ఏమో మొన్న నీకు ఉత్తరం వ్రాసినట్లు చెప్పారు" దిగులుగా చెప్పింది.

లక్ష్మణ్ నిట్టూర్చి సానుభూతిగా ఆమె తల నిమిరాడు. "ఎన్నో రోజులు లంఖణాలు చేసిన మనిషిలా తయారయావు సంధ్యా! రాత్రంతా నిద్రపోనట్లు కళ్లెంత ఎర్రగా ఉన్నాయో తెలుసా! వెళ్లి కాస్సేపు పడుకో" ఆప్యాయంగా అన్నాడు.

"పడుకుంటాను. నువ్వొచ్చావుగా! ఇంక నాకేం భయం లేదు." సంధ్య తేలిగ్గా నిట్టూర్చి అతని వొళ్లో తల పెట్టుకుని కళ్లు మూసుకుంది. ఏమాత్రం సంకోచం లేకుండా తనకా హక్కున్నట్లు వొళ్లో పడుకున్న ఆమెని చూసి చిన్నగా నవ్వుకుని 'పిచ్చి సంధ్య! ఎంత అభిమానం తనంటే!' అనుకోకుండా ఉండలేకపోయాడు లక్ష్మణ్.

చీకటి తెరలు విడిపోతున్నా సంధ్యకి మెలుకువ రాకపోవటంతో ఎత్తుకుని లోపలికి తీసుకెళ్లి పడుకోబెట్టి దుప్పటి కప్పి బయటకొచ్చాడు. అప్పుడే లేచి వాకిలి చిమ్ముతోంది సరస్వతమ్మ. గోపాలరావుగారికి దూరపు చుట్టమౌతుందామె. భార్య పోయిన తరవాత మళ్లీ వివాహం చేసుకోకుండా సంధ్యని చూసుకోటానికి ఆవిడని నియమించారాయన. ఆవిడకీ ఇటూ అటూ ఎవరూ లేకపోవటంతో గోపాలరావుగారింట్లోనే స్థిరపడిపోయింది. "బాగున్నారా బామ్మగారూ!" లక్ష్మణే పలకరించాడు. ఆవిడ పలకరింపుగా అతని వంక చూసి నవ్వి, "నాకేం నాయనా బాగానే ఉన్నాను. ఆ కాలం మనుష్యులం కదూ! మా ఆరోగ్యాలు చెక్కు చెదరవు. నా కంటే రెండు పదులు వెనకవాడైనా మీ మామయ్య చూడు ఎలా జబ్బు పడిపోయాడో! ఇప్పటి తిండి పదార్థాలన్నీ కల్తీలు చేసేస్తున్నారట. మొన్న సంధ్య చెప్పింది." దీర్ఘంగా నిట్టూర్చింది.

లక్ష్మణ్ నిర్లిప్తంగా తల ఊపి గోపాలరావుగారి గదిలోకి వెళ్లి మంచం ప్రక్కగా కూర్చున్నాడు. బాగా తెల్లవారి ఏనిమిది దాటిన తర్వాతకానీ ఆయనకి మెలుకువ రాలేదు. కళ్లు తెరవగానే ప్రక్కనే ఆందోళనగా తన వంక చూస్తూ కూర్చున్న లక్ష్మణ్ కనిపించగానే ఆయన ముఖం నూరు వోల్టుల బల్బులా వెలిగింది.

"వచ్చావా లక్ష్మణ్!" ముందుకి వంగిన లక్ష్మణ్ భుజాలని ఆప్యాయంగా పొదివి పట్టుకుంటూ అన్నారాయన.

"అవును మామయ్యా! ప్రొద్దున్నే వచ్చాను. మీరింకా లేవలేదప్పటికి." లక్ష్మణ్ చెప్పాడు. ఆయన కళ్ళు అతన్ని నఖశిఖ పర్యంతం ఓసారి గమనించాయి.

"బాగా చిక్కిపోయావురా!"

లక్ష్మణ్ నవ్వి, "మీ కళ్ళకి నేనెప్పుడూ అలాగే కనిపిస్తాను మామయ్యా! ఇప్పుడెలా వుంది మీకు?"

"ఉత్తరంలో వ్రాసిన పరిస్థితికీ ఇప్పటి స్థితికీ పెద్ద మార్పేమీ లేదు, నువ్వొచ్చేంత

**అధునాతన ఉపగ్రహ వాతావరణ సమాచార కేంద్రాలు**

అమెరికా వాతావరణ ఉపగ్రహాలు మేఘాలను, మంచు కప్పులనూ గురించి పంపే సమాచారాన్ని అహర్నిశలూ అందుకొనే ఒక కొత్త రకం భూతల కేంద్రాన్ని అక్టోబరు 28 న మేరీలేండ్ లోని గాడార్డ్ వ్యోమ యాత్రల కేంద్రంలో ప్రదర్శించారు.

ఈ భూతల కేంద్రం చిన్న చిన్న భౌతిక లక్షణాలను గురించి సైతం 1960 లలో అమెరికా జాతీయ వ్యోమ పరిశోధన కేంద్రం రూపొందించిన పాత ఆటోమాటిక్ పిక్చర్ ట్రాన్స్‌మిషన్ సిస్టమ్ (ఎ. పి. టి.) కంటె హెచ్చు వివరాలను సేకరించగలదు. ఎ. పి. టి. లను ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ఉపయోగిస్తున్నారు.

వివరాలు మరింత స్పష్టంగా ఉన్నట్లయితే మేఘాలు, వాతావరణ ప్రకియలు, తీవ్రమైన తుఫాను మేఘాల సృష్టి గురించి వాతావరణ శాస్త్రజ్ఞులు బాగా తెలుసుకొని ఫలప్రదమైన హెచ్చరికలు చేయగలరు.

గా ఉంటాననుకోలేదు" నిర్లిప్తంగా ఉన్న ఆమె మాటలు లక్ష్మణ్‌ని బాధపెట్టాయి. తని మనసులోని భావాన్ని గ్రహించినట్టు, "సంధ్య లేచిందా?" అంటూ మాట మార్చేశారాయన.

"నే వొచ్చేసరికి లేచే వుంది. తరవాత నిద్రపోయింది. పాపం దిగులుపడి మనిషి సగమైపోయింది."

ఆయన అదోలా నవ్వారు. "నా గురించి దేం దిగులు పడ్తోందోకానీ దాని గురించి మాత్రం నేను రెట్టింపు దిగులు పడుతున్నాను."

లక్ష్మణ్ ఏదో అనబోయేలోగా సరస్వతమ్మ వచ్చి ఫలహారానికి పిలిచింది.

"వెళ్ళి తినేసిరా లక్ష్మణ్! రాత్రి ఏం తిన్నావో ఏమో! నీతో తరువాత చాలా మాట్లాడాలి."

లక్ష్మణ్ ఆవిడవెంట వంటింట్లోకి వెళ్తూ, "సంధ్య ఇంకా లేవలేదా అమ్మగారూ?" అని అడిగాడు.

"లేదబ్బాయ్! ఇందాక ఓసారి లేపితే లేచి స్నానంచేసి మళ్ళీ పడుకుంది" చెప్పిందావిడ పళ్ళెంలో ఉప్మా పెడ్తూ.

"సంధ్యకి కూడా పెట్టండి. నేను లేపి తీసుకొస్తాను" అంటూ చొరవగా ఆమె పడుకున్న గదిలోకి వెళ్ళాడు లక్ష్మణ్.

దుప్పటి బిగించుకుని ఒకవైపుకి తిరిగి ముడుచుకు పడుకుని మంచి నిద్రలో వుంది సంధ్య. ఒక క్షణం పచ్చటి ముఖం మీద తుమ్మెద రెక్కల్లా పరుచుకున్న నల్లని

త్వరలో

ఓ తారకధ

పెద్దకధ

## ఆమెకేం కావాలి?

వెంట్రుకల్నీ, ప్రతిభగల చిత్రకారుడు నేర్పుగా గీసినట్లున్న కనుబొమ్మల్ని పట్టుదలని సూచిస్తూ నిటారుగా వున్న ముక్కునీ, దట్టమైన కనురెప్పల్నీ చూస్తూండిపోయిన అతను మరుక్షణం తేరుకుని,

"సంధ్యా! లే! ఫలహారం తిందాం" అంటూ తట్టి లేపాడు.

సంధ్య బద్ధకంగా ఆవలించి లేస్తూ, "టైమెంతయింది?" అని అడిగింది.

"తొమ్మిదవుతోంది"

"ఓహ్! చాలా మంచి కల వస్తూంటే మధ్యలో లేపేసావు" ఏదో విలువైన వస్తువుని పోగొట్టుకున్నట్టు దిగులుగా అంటున్న ఆమె వంక చూసి నవ్వుతూ.

"ఏమిటంత మంచి కల? నా గురించా?" కొంటెగా అన్నాడు లక్ష్మణ్. సంధ్య ఆశ్చర్యంగా కళ్ళు టపటప లాడించింది "ఎలా ఊహించావు? నిజంగా నీ గురించే మనిద్దరం కాశ్మీర్‌కి వెళ్తున్నామట. నేనేమో కార్లో నుండి ప్రకృతి దృశ్యాలు గమనిస్తూ కూర్చున్నానట..." ఆమె మాటలు పూర్తి కాక ముందే ఫక్కున నవ్వి,

"కారా? మనకెక్కడిది?" అడిగాడు లక్ష్మణ్ ఆమె కలని హాస్యాస్పదంగా తీసుకుంటూ.

"ఏమో నాకైతే నువ్వు అంబాసిడర్ కారుతో సహా కనిపించావు." సంధ్య మాటలకి నవ్వి,

"బాగుంది. కలకేంగానీ టిఫిన్ తిందాం పద!" లేస్తూ అన్నాడు, సంధ్య అతన్ని అనుసరించింది. టిఫిన్ ముగించాక సరాసరి గోపాలరావుగారి దగ్గరికొచ్చి ఆయన ఎదురుగా కూర్చున్నాడు లక్ష్మణ్.

"ఏమిటి మామయ్యా ఇందాక నాతో ఏదో మాట్లాడాలన్నారు?" ముందుగా తనే ఆ ప్రస్తావన తెస్తూ అన్నాడు.

పేపరు చదువుతున్న గోపాలరావుగారు అది ప్రక్కన పడేసి లక్ష్మణ్ వంక తదేకంగా నిమిషం పాటు చూసి నిట్టూర్చారు.

"అదేరా! మన సంధ్య విషయం!" ఆయన కాస్త తటపటాయిస్తూ ఆగటం చూసి,

"సంధ్య పెళ్ళి గురించి మీరు దిగులు పడనవసరం లేదు మామయ్యా! ఆమెకి నేనున్నాను." వెంటనే అన్నాడు లక్ష్మణ్.

గోపాలరావుగారి కళ్ళు ఒక్క క్షణం కాంతి పుంజుకుని అంతలోనే తేజో రహితమైపోయాయి. అతని చేతిని నొక్కి,

"నాకు తెలుసురా లక్ష్మణ్ నువ్వామాట అంటావని. నిజానికి నిన్ను ఆ ఉద్దేశ్యంతో చేరదీసి పెంచకపోయినా, నువ్వు వృద్ధిలోకి వచ్చాక నీ కంటే మంచి అల్లుడిని తేలేనని అనిపించింది. నీలాంటి అందగాడినీ, విద్యావంతుణ్ణి పొందగలగటం సంధ్య అదృష్టం అనుకున్నాను. కానీ సంధ్య ఆ అదృష్టాన్ని అందుకునే స్థితిలో లేదని ఈ మధ్య తెలిసింది." అన్నారు.

లక్ష్మణ్ అర్థం కానట్టు చూసాడు. "అంటే సంధ్యకి నేనంటే ప్రేమ లేదంటారా మామయ్యా?"

"ప్రేమలేదా?! చెప్పలేనంత ప్రేమ. కానీ ప్రస్తుతం దాని దృష్టి డబ్బు, హోదా గల కుర్రాళ్ళమీద ఉంది. డబ్బుతోడిదే లోకమట. నీమీద ప్రేమ ఒకవైపూ, హోదా ఐశ్వర్యాలు మరోవైపు పెట్టి తూకంవేస్తే దాని మనసు రెండోవైపుకే మొగ్గుతోంది." గోపాలరావు గారు నిట్టూర్చారు.

(ఇంకా వుంది)



నేపాల్ రాజ సోదరులు రాకుమారులు శ్రీ జ్ఞానేంద్ర వీర్ విక్రమ్ షా, శ్రీ ధీరేంద్ర వీర్ విక్రమ్ షా, [illegible] శ్రీమతి కోమల్ రాజ్యలక్ష్మీ దేవి షా (శ్రీ జ్ఞానేంద్రవీర్ విక్రమ్ షా సతీమణి) న్యూఢిల్లీలోని రాష్ట్రపతి భవన్‌లో నవంబరు 7 వతేదీన రాష్ట్రపతి దంపతులని కలుసుకున్నారు. రాకుమారి శ్రీమతి కోమల్ రాజ్యలక్ష్మీదేవీ షా, బేగం అబిదా అహమ్మద్ గార్లని చిత్రంలో చూడవచ్చు





మీరుగూడా ఇంత ఆకర్షణీయంగా కనబడాలంటే, ఈ గుర్తు జ్ఞాపకముంచుకోండి!
ఇది పోదార్ టెక్స్టైల్స్ వారి గుర్తు!







PODAR
textiles
సూటింగ్స్ ★ షర్టింగ్స్
మరియు చీరెలు

# ఉక్కు బీరువా

జి. రంగనాథరెడ్డి



తెల్లచీర, తెల్లజాకెట్, తల్లో మల్లెపూలు. గడపదగ్గరే నుంచుని ఎదురు చూస్తోంది సుబ్బరత్నం.

సుబ్బరత్నం అనే పేరు వినగానే మీకు పొట్టిగా, బొద్దుగా, నల్లగా, పెద్ద ముక్కుపుడకతో, ఓ స్త్రీ రూపం, గుర్తుకు రావచ్చు. క్షమించాలి. కానీ, ఈ సుబ్బరత్నం మరీ అందగత్తె కాకపోయినా, చామనచాయే–ఐనా అందకత్తె, వాళ్ల నాయనమ్మ పేరు పెట్టారు, ఒక్కర్తె కూతురు కావడంతో.

ఇప్పుడు ఎదురు చూడ్డం.. చేస్తూండగా ఎదురుగా పుస్తకాల సంచీలు, చేతిలో చిన్న క్యారియర్లు, ప్లాస్టిక్ వాటర్ బ్యాగులతో, పుత్రుడు నానిగాడు, పుత్రిక చంటి కనిపించారు...

"ఒరేయ్ నానీ, ఒసే చంటీ!" పిలిచింది. చిన్న గుండెల్లో చిన్న మీటర్‌గేజ్ రైళ్ళు పరిగెత్తాయి. స్కూలు వదలంగానే రాకుండా ఆడుకుని బట్టలు మాపుకున్నందుకు తిడుతుందేమోనని– బితుకు, బితుకుమంటూ దగ్గరకొచ్చారు.

చాలా గారంగా, యిద్దర్నీ దగ్గరకు తీసుకుని, ముఖాలు కడిగించి, బట్టలు మార్చి కూర్చోపెట్టి, పకోడీలు వేడిగా వున్నవి తినిపించి, పాలు తాగించింది.

మతులు పోయాయి వాళ్ళిద్దరికీ...

"అమ్మా! నాన్న నీకు చీర కొనుక్కొస్తా వన్నారా?" అంది పుత్రికారత్నం. అలాంటి సమయాల్లోనే, ఇలాంటి అమావాస్యలో చంద్రుడుదయించే ఘట్టాలు జరగడం–

కూతురు ప్రశ్నకు మురిసిపోతూ, ఇద్దర్నీ ముద్దాడి, "మనకు బీరువా వస్తోందిరా– మనం నెలనెలా డబ్బులు కట్టేదంతా, వాటొచ్చి చెప్పారు. నేను మీ నాన్నా, రేపెళ్ళి చూసొస్తాం... మీ యిద్దరికీ ఏం రంగు బాగుంటుందో చెప్పండి."

"బీరువాంటే ఏంటే?" అడిగాడు నానిగాడు.

ఈ ప్రశ్న అడిగే దిక్కులేక... వివరితో దాని ఉపయోగ ఉపన్యాసం యివ్వాలో తెలీక పోయినా సుబ్బరత్నానికి సంతోషం పొంగుకొచ్చింది.

"నానీ! బీరువా అంటే, మీ నాన్న అంత ఎత్తు, మీ నాయనమ్మ అంత వెడల్పు వుంటుంది. మన వంటగదంత తలుపులు వుంటాయి. అందులో మీ నాన్న బట్టలు, హేంగర్స్‌కివేసి తగిలించొచ్చు. నా చీరలు, బట్టలు పెట్టుకోవచ్చు, డబ్బుదాచుకోవచ్చు, ముఖ్యమైన వస్తువులన్నీ పెట్టుకోవచ్చు." అదీగాక సినిమాల్లో చూస్తే... దొంగలు ఇంట్లో పడ్డప్పుడు బీరువాలో డబ్బు, నగలన్నీ దోచుకుంటూంటారు అదే బీరువాలంటే"– ఈ దొంగతనం ఉదాహరణ ఎందుకు చెప్పానా అనుకుంది.

"అమ్మా! నా బొమ్మలు పెట్టుకుంటానే!"

"అమ్మా! నా బ్యాట్, బాలు పెట్టుకుంటానే –" వాళ్ల ఆరాటం.

తన చిరంజీవుల తెలివికి తల్లి కాసేపు విచారించింది – "అయ్యో! అందులో విలువైనవే, పెట్టుకోవాలమ్మా చిన్నీ! నీకు తాతయ్య చేయించిన గొలుసు... నానిగాడి వెండి మొలతాడు పెట్టుకుందురుగానిలే."

ఆ మాత్రమైనా వాళ్ళకు శాంక్షన్ చేసినందుకు ఆనందంతో ఆ చిన్న బుర్రలు తలూపాయి.

ఇంతలో సైకిల్ బెల్ వినిపించింది. తన పతి, తన పిల్లల జనకుడు ఐన గోవిందు వచ్చాడు.

"ఏమండీ! త్వరగా ముఖం కడుక్కురండి. పకోడీలు వేడిగా వున్నాయి." అంది.

"ఏమిటి సుబ్బరత్నాదేవీ! ఈ అకాల వసంతం!" అన్నాడు.

"సరే ... మొహం కడుక్కు రండి"... అంది.

ఇంతకు ముందు ఐతే, ఏంటీ 'సుబ్బూ; పుబ్బూ'; రత్నా అనరేమా?" అని కసిరేది... సినిమాకేమైనా ఐడియా ఎక్కుపెట్టిందా అని మాట్లాడకుండా, కాఫీతాగి సిగరెట్ వెలిగించుకున్నాడు.

"ఏమండీ! ఆ...మన బీరువా అతను

వచ్చాడండీ... అతనేనండీ మనం వాయిదాల మీద డబ్బు కడుతున్నామే... సుబ్బారావు అత నొచ్చి చెప్పాడు. మన వాయిదాలు అయి పోయాయిగా... రేపొచ్చి బీరువాచూసి మన కిష్టమైన రంగు చెపితే, యిస్తాడట. రేపెళ్లి చూద్దామండి. ఏ రంగు కావా లందాం ?..."

ఇన్ని ప్రశ్నలు వచ్చినదేసరికి, ఏం మాట్లా డాలో అర్థం కాలేదా-మె నవుడికి...

"అమ్మా!...తెలుపు బావుంటుందే"... నానిగాడు అన్నాడు.

"నలుపే"...అంది చంటిది.

'వద్దు రా...నాకేమో ఆకుపచ్చ బావుం టుంది. ఏమండీ!...'భుజాలుపట్టి కుదిపింది.

"హోం మినిస్టర్ చెప్పాక తప్పుతుందా, పిల్లలూ! ఆకుపచ్చే మన బీరువా రంగుగా ఆమోదించడమైనది." అన్నాడు.

రేపు ఉదయం వెళ్ళి, బీరువాని చూసి రంగు చెప్పిరావాలని నిర్ణయించుకున్నారు.

ఆ తెల్లవార్లూ నిద్రలేదు సుబ్బరత్నానికి. బీరువా కలలే. మధ్యలో మెలకువొచ్చింది "నిద్ర పోలేదా?" అడిగాడు "అది కాదండీ. మన బీరువా" ఏదో చెప్పబోయింది. నోరు మూసి తన మీదకు లాక్కున్నాడు.

* * *

ఆ దుకాణానికి వెళ్లారు. సుబ్బారావు సగౌరవంగా ఆహ్వానించాడు, సుబ్బరత్నం దంపతుల్ని. అక్కడున్న బీరువా తను కోరిన రంగే. "బీరువా యిదేనాండీ!" సుబ్బరత్నం ఎగిరి గంతేసింది. "ఇది శాంపిల్ అండీ. మీరు కలర్ ఫిక్స్ చెయ్యంగానే వచ్చే బుధ వారం అంటే ఇంక నాలుగు రోజులకి మీ రొచ్చి తీసుకెళ్లొచ్చు. అప్పటికన్నీ వచ్చే స్తాయి" అన్నాడు.

బీరువా తెరిచి చూపించాడు. బట్టలు తగిలించే హ్యాంగర్లు పెట్టుకోడానికీ, చిన్న తలుపులున్న అరలు. చాలా ముచ్చటగావుంది. సుబ్బరత్నం అన్నీ అడిగింది. సుబ్బారావు ఓపిగ్గా సమాధానాలు చెప్పాడు. ఈ బీరువా తన స్వంతం అనే ఊహతో సుబ్బరత్నం మనస్సు సినిమా వంద రోజులు ఆడినప్పుడు పొంగే నిర్మాత మనస్సులా పొంగిపోయింది.

"సరిగ్గా ఏరోజు రమ్మంటారు"గోవిందు అడిగాడు.

"ఈవాళ సోమవారం కదండీ! శుక్ర వారం ఉదయం రండి, పట్టుకుపోదురు."

"ఆహా! నా గృహానికి లక్ష్మీదేవిలా రాబో తుంది ఈ బీరువా. నా బుజ్జి బీరువా" అను కుని ఎవరూ చూడకుండా ఓ ముద్దు పెట్టు కుంది సుబ్బరత్నం.

బయటికొచ్చాక "నేహాఫీసు కెళ్తాను, నువ్వింటికి వెళ్ళు... నాకు టైమైంది." అన్నాడు గోవిందు...

"ఉండండి – రోజూ వెళ్ళే ఆఫీసేగా" అంటూ హోటల్ కెళ్లి ఓ కాఫీ తాగేద్దాం. చిన్న పనుంది" అంటూ హోటల్ కు లాక్కెళ్ళింది. కాఫీ తాగాక ... పక్క నున్న ఓ ఫ్యాన్సీ స్టోరు కెళ్ళారు. తాళాలు పెట్టుకునే గుత్తి చూపించమంది. విస్మ యంతో చూస్తున్న గోవిందుని "ఏమండీ! మన బీరువా వస్తుందిగా...తాళంచెవి. ఇంటివి అన్నీ ఎక్కడ పెట్టుకోవాలన్నా విసుగ్గా వుందండి. తాళాలగుత్తి వుందనుకోండి, వెంచక్కా బొడ్లో దోపుకోవచ్చు. బాగా అందంగా కూడ కనిపిస్తుంది" అని అతని నోరు మూయించింది.

ఈ బీరువా రాకముందే ఇన్ని కష్టాలు మొదలవుతున్నాయి, వస్తే ఇంకెలావుంటుందో అని విచారించాడు, ఆ మానవుడు. తాళాల గుత్తి తీసుకొని బొడ్లో దోపుకొని, ఎదు రుగ్గా అమ్మడానికి అమర్చిన చిన్న చిన్న అద్దాల్లో తన తాళాలగుత్తి తన ముఖం కని పించడానికి నానా యాంగిల్స్‌లో కృషిచేసి చివ రికి తృప్తిపడి బయటి కొచ్చింది. ఇంటి కెప్పుడెప్పుడు వెళ్తామా. ఇరుగమ్మలు పొరు గమ్మల కెపుడు చెబుతామా, అని వుంది మనస్సు. ఈలోగా బిల్లు చెల్లించి వచ్చాడు. గోవిందు. "మీరిక ఆఫీసు కెళ్ళండి" అంది. "సరేలే" అని, ఇంత ఖర్చయింది. పోనీలే. అనుకుని ఓ పాతిక పైసలు మల్లె పువ్వులు కొని పెళ్ళాం, పేవ్‌మెంట్ మీద అమ్ముతుం టే అవిచ్చి వెళ్లిపోయాడు. పతిదేవుడు



బహూళార్థ సాధక శ్రీశైలం ప్రాజక్టు

శ్రీశైలం ప్రాజక్టు పని చురుగ్గా సాగ టానికి అగస్టు మొదటి వారంలో ప్రభుత్వం దానిని ఆంధ్రప్రదేశ్ నిర్మాణ సంస్థకి ఒప్ప చెప్పింది. సొరంగాలపనిని నటేశ్ ఇంజనీరింగ్ కంపెనీ నిర్వహిస్తున్నది. డాం ఎత్తు నదీ మట్టానికి 900 అడుగులు. ఈ అక్టోబరుకు 690 అడు గులు గోడ కట్టారు. ఇతర భాగం నిర్మాణం కూడా చురుగ్గా జరుగుతోంది. విష్ణుగిరిలో పవర్‌స్టేషన్ నిర్మాణానికి పునాదులు తీస్తున్నారు. మొదటి జల విద్యుదుత్పత్తి యంత్రం రెండేళ్ళలో పని చేయడం ప్రారంభిస్తుంది. క్రమంగా ఉత్ప త్తిని 700 మెగావాట్లకి పెంచుతారు. ఈ ప్రాజెక్టుపనిలో మన యింజనీర్ల ప్రతిభని విదేశీ యులు ప్రశంసించారు. సీటిపారుదల, సాగు అవకాశాల పరిశీలన జరుగు తోంది. జగద్గురు శ్రీ శృంగేరిస్వాములవారు 1968 లో స్థలాన్ని, నిర్మాణాన్నిచూసి అది జయప్రదంగా పూర్తయి లోకకళ్యాణానికి తోడ్పడాలని ఆశీర్వదించారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తగినంత డబ్బుని కేటా యిస్తే ఈ ప్రాజెక్టు త్వరలోనే పూర్తవుతుంది.

[ఆం. ప్ర. ప్ర వి

పేమకు మనస్సులో మురిసిపోతుండగా రువా ఆలోచనవచ్చి గోవిందుని తప్పేపి కానాక్షమించుకుందామె మనస్సుని.

*  *  *

గడపలో కూర్చుని చిర్రు బుర్రు లాడు కొంది సుబ్బరత్నం. ప్రక్కింటి వనజతో బీరువా గురించి చెబుదామని వెళ్ళింది. వాళ్ల పుట్టింటి వాళ్ళు మొన్ననే ఓ బీరువా పంపేరు. పైగా అన్నీ తనకే తెల్సినట్లు "మేం కొన్న కంపెనీ మంచిది. మీ బీరువాల వాడు చేయించి ఇస్తున్నాడన్నారు. అందులో ఏదో మోసముంటుంది. కొన్నింటికి రంగు 'ఫేడ్ అయిపోతుంది" అని ఫేడంటే తన కర్మం కాదని రంగు వెలసి పోతుందని లేదా పెచ్చులూడిపోతుందని ఏదేదో అంది. సుబ్బ రత్నానికి ఒళ్ళు మండింది. పైగా ఆ సుబ్బా రావు ఎంతగా చెప్పాడు, తుపాకితో కాల్చినా తూట్లు పడదన్నాడు. అంటే తనకు పోటీగా బీరువా వస్తుందని దీని ఏడుపు అనుకుని వచ్చే సింది. ఇంకెవరికి చెప్పదలుచుకోలేదు. చెబితే అపశకునపు కూతలు కూస్తారని.

"తోటకూరమ్మా! తాజా తోటకూర" కూరలమ్మేవాడి అరుపు వినిపించింది. "ఓయ్ తోటకూర" పిలిచింది. వచ్చాడు. బుట్ట దించాడు. బేరమాడకుండా ఓ నాలుగు కట్టలు కొంది. 'ఇలాంటి వాళ్ళంటే సుల



భంగా అమ్ముకోవచ్చు' అనుకున్నాడు వాడు. ఇంట్లో కెళ్ళి చిల్లర డబ్బులకోసం పోపు డబ్బాలో వెతికింది. చిల్లర తగల్లేదు. బీరువా లేకపోవడం ఎంత లోటో తెలిసింది. ఓ ఇరు వది రూపాయల నోటు మాత్రం వుంది. ఆకుకూర వెనక్కిస్తే నామోషీ అనుకుంది.

"ఇరవై రూపాయలకి చిల్లరుందా అబ్బీ" అడిగింది.

"నా బుట్టంతా అమ్మినా పదిరూపాయలు చెయ్యవమ్మా, తొలి బేరమే ఇలాగైతే ఎలా గమ్మా! చిల్లరుంచుకోకూడదూ?" అన్నాడు వాడు.

"కాదబ్బీ! ఎల్లుండి మా బీరువా వస్తుంది. అందులో డబ్బులు వేసుకొనె అర వుంటుంది. అప్పుడు చిల్లరంతా జాగర్త చేస్తాను. వెధవది పోపు డబ్బాలో వుందను కున్నాను లేదు."

"ఇప్పుడేం చెయ్యమంటావమ్మా" ... అన్నాడు తమకు బీరువా వస్తోందన్నా, వాడు గౌరవాన్ని పెంచుకోలేకపోయాడు.

"బాబ్బాబు ... ఇంటాయన ఆఫీసు కెళ్ళారు. ఆడదాన్ని ఎలా వెళ్లను? ఆ ప్రక్కవీధిలో మా ఖాతా పచారీ కొట్టుంది... అనపా గోవిందుగారి భార్య పంపిందంటే చిల్లరిస్తాడు – తెచ్చిపెడుదూ? ఓ పది పైసలు ఎక్కువ తీసుకుందువు గాని" – అంది.

వాడు గొణుక్కుంటూ ఆ నోటు తీసు కొని వెళ్ళాడు – బుట్ట అక్కడే పెట్టి – తాను బీరువా లేనందున ఇంకా ఇలాంటి కష్టాలు ఎన్ని పడ్డది గుర్తుకు తెచ్చుకుంటూ చింతిస్తూ కూర్చుంది... ఆ బుట్ట పక్కనే–

"ఒంటిగంటయింది. ఇంక భోం చెయ్యాలా వదినా" – అంటూ ప్రక్కింటివాళ్ల కమల వచ్చింది. తీసికెళ్ళిన వారపత్రిక తిరిగి ఇచ్చెయ్యటానికి.

"ఆ ఒంటిగంటా!" ఉలిక్కిపడింది. కూరలమ్మేవాడు కొంప ముంచాడు. బుట్ట తన మొహాన పడేసి డబల్ లాభంతో ఉడా యించాడు, రెపరెపలాడే ఇరవై రూపాయల నోటుతో. గుండెల్లో రాయి పడింది.

సాయంత్రం భర్త రాగానే బాధగా చెప్పింది చివరకు ఆ బుట్ట సైకిలికి పెట్టుకుని మార్కెట్‌లో కూరగాయలకొట్లు వాళ్లకు అమ్మి రమ్మంది.

ముక్కు మొహం తెలియని వాడికి ఇరవై రూపాయలనోటు నమ్మి. యిచ్చినందుకు మండిపడ్డాడు. పెళ్ళాంమీద...

పోనిద్దురూ – బీరువా వచ్చిందాకేగా? అంటూ ఇంక ప్రసన్నం చేసుకోడానికి అటూ, ఇటూ చూచి బుగ్గ మీద ఓ ముద్దెట్టుకుంది – దాంతో కిమ్మనకుండా సైకిల్ క్యారియర్‌కు తాడుతో బుట్టను బిగించి...నానా అవస్థ పడుతూ వెళ్ళి చెమటలు, కక్కుకుంటూ వచ్చి, ఓ నాలుగు రూపాయలు ఇచ్చాడు సుబ్బరత్నానికి "ఇంతకుమించి చచ్చినా ఓ పైసా యివ్వనన్నారన్నాడు" ఒగురుస్తూ–

*  *  *

శుక్రవారం – తెల్లారగట్ల నాలుగింటికే లేచింది. సుబ్బరత్నం. ఇల్లంతా కడిగింది– ముగ్గులు పెట్టింది. బీరువా పెట్టాలనుకున్న స్థలంలో ఒకటికి రెండుసార్లు పసుపునీళ్ళతో కడిగి ముగ్గు పెట్టింది. తలంటుస్నానం చేసింది. పిల్లలనిలేపి స్నానాలు చేయించింది. భర్తను లేపింది. గోవిందు కళ్ళు నలుము కుంటూ లేచాడు, తలారా స్నానముచేసి ముఖముమీద పడే ముంగురుల్ని యెగదోసు కుంటున్న భార్యనుచూసి చేయిపట్టి లాక్కో బోయాడు. అందకుండా ప్రక్కకు ఎగిరింది.

(36 వ పేజీ చూడండి)



# సంతోషమే సగము బలము ★


అమితే ఈ సెక్షన్ హెడ్ కూ-ఆ సెక్షన్ హెడ్ కూ పడ దన్నమాట!
ఈ సుండు మీద ఈగ ఆ సుండు మీద వాలడానికి వీల్లేదు!
*రమేష్*


నేనిది ఆసుకెళ్లడం లేదు సార్! మీకు దగ్గరగా జరుపుతున్నా! వదలండి సార్!!
కటూరి


వాళ్లొంచి బయటికి వచ్చేసావ్, జనం తేరా లోపలా నల్లిమావా!
ఉన్నారు కానీ అది బోరు సినిమాయె నల్లి మరదలా! భరించలేక వచ్చేసాం బయటికి!
సొంబు


ఈ చదువులకి ఎంత డబ్బు చాలటల్లేదురా... అందుకనే ఏదైనా ఉద్యోగం చేస్తూ ప్రైవేటుగా చదువు కోవాలనుంది!
3వ తరగతి
విద్యా

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

(గత సంచిక తరువాయి)

'ఎక్కడి కెళ్లావు?' యింట్లో అందరూ వనితని యిదే ప్రశ్న వేస్తున్నారు. వనిత మారు మాట్లాడక 'యిక్కడికే పనిమీద వెళ్లాను. పని పూర్తికాగానే చెబుతాను.' అంది పిల్లవాడిని ఎత్తుకుంటూ.

యామిని మాట్లాడకుండా పిల్లవాడిని అందించి వెళ్లిపోయింది.

జీవితాన్ని గురించి వనిత పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది. ఇప్పుడీ ప్రయాణంలో తను ఒంటరిగా ప్రయాణం చేస్తున్నా ఆమెకు అజ్ఞాత బంధంలా భర్త తాలూకు ముద్రపడే వుంది. ఆ ప్రయాణం ... ఓహ్ ఢిల్లీ నుంచి తను చేసిన ప్రయాణాన్ని జీవితంలో మరచిపోగలదా? ఏడీ గాంధీ ... తను పరిత్యక్త. ఎలా అందుకోగలదు అతని ఆదరణను. వనిత మరోవిధంగా కూడా ఆలోచించసాగింది. ఈ బ్రతుకింక యింతే అతని గురించి ప్రత్యేకం ఆలోచించే అవసరం, ఆశా అనవసరం. కలనైనా తను ఆ ఆలోచన దరిదాపులకి రానివ్వకూడదు. తన బంధానికి గుర్తుగా యిప్పుడు 'నెహ్రూ' వున్నాడు. తను ఏరి కోరి పెట్టుకుంది ఆ పేరు. గాంధీమహాత్ముడికి సన్నిహితుడు నెహ్రూ. ఆ పేరు యెందుకు పెట్టావు? అని అడిగినవాళ్లకి 'నా కొడుకుకూడా యెప్పటికైనా దేశ నాయకుడు కావాలని.' అని నవ్వుతూ సమాధానం యిచ్చేది. తన అంతరంగంలో గాంధీకి వున్న స్థానాన్ని మరెవరికీ చెప్పుకోలేదు కనుక.

ఆమె పరుపుమీద పడుకుంది. గోకుల్ గుర్తుకురాగానే క్షణం తొందరపడ్డానా అనుకుంది. వెంటనే ఆమె కన్నీరు వరద గోదావరిలా పెల్లుబికి వస్తూ ఆమెకు స్త్రీ సహజమైన ఈర్ష్యని గుర్తుకుతెచ్చాయి. ఏ బాధనైనా గుండెల్లో దాచుకుని నవ్వించే స్త్రీ తన భర్త మరో స్త్రీతో వుండడాన్ని ఏ సందర్భంలోనూ భరించలేదు. అటువంటి నాటకాన్ని అసలే జీర్ణించుకోలేదు. ఈ చట్టాలూ శాసనాలూ ఏర్పాటు చేసినట్లు విడాకులు తీసుకున్న తరువాత ఎవరి దారి వారిదని సరిపెట్టుకోగలదేమోకానీ...మెత్తని తలగడ ఆమెను కలవరపెట్టసాగింది. ఆమె లేచి వెళ్లి బాత్‌రూమ్‌లో బట్టలు తలుపుమీద వేసుకుని బకెట్‌లో వున్న నీళ్ళ స్నానం చేసింది.

యామిని చప్పుడు విని బయటకు వచ్చింది.

బాత్‌రూమ్ లోంచి కూతురు రాగానే అడిగింది: 'యిదేమిటి వనితా యిప్పుడు స్నానం చేస్తున్నావు.'

వనిత ఆమెకేసి ఒక క్షణం చూసి 'బట్టలు నిద్రలో పాడుచేశాడు నెహ్రూ. చికాకుగావుంటే స్నానం చేశాను.' అంది.

'ఛ ఛ ... సమయం సందర్భం లేకుండా యెప్పుడుపడితే అప్పుడేనా స్నానం చేయడం. మంచీ–చెడూ ఆలోచించవద్దూ.'

'హుం!' నవ్వింది వనిత. 'మంచి...' ఆపైన మాట్లాడకుండా గదిలోకి వచ్చేసింది. గది తలుపులు వేసుకుంది. అగరువొత్తులు వెలిగించి భగవంతుడి ముందు రెండు నిమిషాలు కళ్ళు మూసుకుని నిలుచుంది.

ఇప్పుడామె మనసు ప్రశాంతంగా వుంది. తల ఆరబెట్టుకునేందుకు ఫాన్ ముందు వాలుకుర్చీలో కూర్చుంది. ఆమెకు మరుక్షణం నిద్రపట్టేసింది.

* * *

'మీ అమ్మకి యిక్కడికి వస్తున్న సంగతి చెప్పావామ్మా',

'లేదండి'

'ఎందుకని?'

'ఆమెను జీవితాంతం ఏడిపించాల్సి వస్తుందేమోనన్న భయంతో చెప్పలేకపోయాను. మీ దగ్గరకు వస్తున్నానని తెలుస్తే అమ్మ చచ్చిపోతుంది.'

ఆయన చివాలున కళ్ళెత్తిచూశారు. వనిత ఆయన మొహంలోకి ప్రశాంతంగా చూస్తూ ఆయన చూపుల్ని ఎదుర్కుంటోంది.

దీర్ఘంగా నిట్టూర్చి యిలా అన్నారు: 'నేను అందంగా వుంటానన్న అహం; దానికితోడు నేను చదివిన చదువు నన్ను యీ స్థితికి తెచ్చాయి. మీ అమ్మ చదువుకోలేదు కనుక ఆమె వెర్రి వెంగళాయి అనుకునేవాడిని. నేను లండన్‌లో వుండగా ఆమె నన్ను విపరీతంగా ఆకర్షించింది. తరుచు నా రూమ్‌కి వచ్చి భార్య కంటే చనువుగా, సన్నిహితంగా... ఐయామ్ సారీ... నా బిడ్డ ముందు సిగ్గు విడిచి కథ చెప్పవలసి వస్తుందనుకోలేదు. అయినా తప్పదు. నా గుండెల్లో రగులుతున్న ఈ మంటని యిన్నాళ్ళకైనా చల్లార్చుకుంటాను.'

'ఆమె లేని నేను జీవచ్ఛవాన్ననుకునేవాడిని జరిగిపోయిన కథ వినిపించడం నీకు తెలిసిందే కనుక చర్విత చర్వణం అవుతుందని యింక మానేస్తున్నాను.'

'కానీ వనితా... మగవాడు స్త్రీలోలుడు అయేందుకు ఒక విధంగా స్త్రీ అసమర్థత అంటాను.'

వనిత తెల్లబోయి చూసింది. వెంటనే గొంతు పెగల్చుకుంటున్నట్లు అంది: 'యిది అన్యాయం నాన్నగారూ. ప్రపంచంలో పురుషులందరూ అడ్డదారులు తొక్కేందుకు కారణం స్త్రీ అసమర్థత అంటే నేను ఒప్పుకోను.'

'ముఖ్యంగా మన సంస్కృతి, మన ఆచారాలూ కట్టుబాట్లూ వీటిని నిర్లక్ష్యం చేస్తూ దైవచింతనా పాపభీతీ లేనివాళ్ళే స్త్రీని అసమర్థురాల్ని చేస్తున్నారు.'

'శారీరకంగా మానసికంగా భర్తకోసం, తన పరివారం కోసం స్త్రీ చేసే త్యాగం ముందు పురుషుడు చేస్తున్న ప్రతిఫలం ఎంత? ఏమీలేదు. ఆమెను చేతకానిదాన్ని చేసి యిష్టం వచ్చినట్లు ఆడిస్తున్నాడు.'

'మై గాడ్', ఆయన నిట్టూర్చి: 'నా బిడ్డ యింత తెలివైనదని నేనెన్నడూ ఆలోచించలేదు.'

'మీరు ఒంటరిగా వుంటున్నారని విని మీకు యీ వృద్ధాప్యంలో తోడుగా, కన్న నేరానికి సేవ చేసేందుకు వచ్చాను నేను. మీరు యిదీ నా అసమర్థత అంటారా?'

*జరిగిన కథ 8:* తల్లి యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చిన డాక్టర్ వనితకి రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన అందంతో ఆమె హృదయంలో తిష్టవేస్తాడు. తనను ఎంతో ప్రేమగా చూసే మేనమామ భార్య శ్రీదేవి భర్తృ పరిత్యక్త అయిన తన తల్లిపట్ల నిర్దాక్షిణ్యంగా వుండటం బాధిస్తుంది వనితని. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్ ఇంజనీర్. తనను పెళ్లాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొచ్చి ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది వనిత. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణరావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. పాశ్చాత్య నాగరికతపై మోజున్న భర్త కోపతాపాలకి హడలిపోతుంది యామిని. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరగాలనుకుంటుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్లిన రావ్ అక్కడ మరో పెళ్లి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్లయిన వెంటనే అమెరికా బయల్దేరిన వనిత తండ్రిని కలుసుకోవాలనుకుంటుంది. గాంధీ తండ్రి పట్నాయక్‌గారు రాజకీయవాది. గాంధీతోపాటే పట్నాయక్ ఆదరణలో పెరిగిన హరిజన యువతి కాదంబరికి గాంధీని వివాహమాడాలనుంటుంది. వనితకి వివాహ మయిందని తెలిసిన గాంధీ వ్యాకులత చెందుతాడు. గోకుల్ కోరుకునే సంఘ జీవనానికి అలవాటు పడలేకపోతుంది వనిత. తన ఎదుటే గోకుల్ పరాయి స్త్రీని చేరదీయటంతో మనసు విరిగిపోయి గోకుల్‌ని వదిలి కొడుకుతోపాటు హైదరాబాద్ వచ్చేసిన వనిత తండ్రిని కలుసుకుంటుంది మొట్టమొదటిసారిగా.

'అదెలా ?'

'హాఁ' వనిత ఆయనవైపు చూసింది. 'భర్త వదిలిపెట్టినందుకు ఆస్తి హక్కుల గురించి అసమర్థతను ఆయుధంగా తీసుకుని వచ్చానని అనరా.'

ఆయన కుర్చీలోంచి లేచి వచ్చి వనితను గుండెల్లోకి తీసుకున్నారు. 'ఒద్దు తల్లీ ఒద్దు. నువ్వు యింక ఏమీ మాట్లాడద్దు. నేను నీ తండ్రిని కాను. నువ్వే నాకు తల్లివి. నేను చేసిన పొరపాటు ఏ మగవాడూ చేయకూడదు. నేను నీ భర్తతో మాట్లాడి అతన్ని రప్పించి మీ జీవితం బాగు చేస్తాను'

వనిత వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆయన ఖంగారుగా ఆమె మొహాన్ని రెండు చేతులతో ఎత్తి తనవైపు తిప్పుకున్నారు.

'ఒద్దు నాన్నా మీరు శ్రమ పడద్దు. నేను అతన్ని వదిలి వచ్చేశాను. మీరు చెప్పండి నేను ఏం చేస్తే బాగుంటుందో' అంది కళ్ళు తుడుచు కుంటూ.

రావుగారు ఆమెను తీసుకుని వెళ్ళి సోఫాలో తన పక్కన కూర్చోబెట్టుకున్నారు.

ఆయన చెప్పే విషయాన్ని ఆమె శ్రద్ధగా వింటోంది.

* * *

పదేళ్ళ క్రితం ఎప్పుడో ఆ రోడ్డు నిర్మానుష్యంగా వుండేది. యిప్పుడక్కడ పెద్ద పెద్ద మేడలు ఆకాశాన్నంటుకుంటున్నాయి. ఆ కాంపౌండ్ కి ముందు పచ్చని చేలు పైరు గాలికి వూగిసలాడేవి. యిప్పుడక్కడ మూడంతస్థుల భవంతులు కట్టేశారు. నలభై యిళ్ళ కాంపౌండ్ అది. ఆ చుట్టుపక్కల ఎక్కడా సరియైన బస్ స్టాప్ వుండేది కాదు. యిప్పుడక్కడ సినిమా హాలు వెలిసింది. హుసేన్ సాగర్ గాలులు విపరీతంగా వీచినప్పుడు అక్కడి వాళ్ళందరి వొళ్ళూ ఒక్కసారి వులకించేవి. మేడలు అడ్డురావడంవల్ల యిప్పుడక్కడ గాలి రావడం పూర్తిగా మానేసింది.

ఇప్పుడక్కడ ఎకరం భూమిలో ఓ చిన్న హాస్పటల్ వెలిసింది. అక్కడికి వచ్చే రోగులు అధికభాగం ధనవంతులే.

డాక్టర్‌గారు ప్రతి నిమిషం రోగి ఆలనాపాలనా చూసుకుంటారు. ఆమెకు తండ్రే స్వయంగా సలహా యిస్తూంటారు. ఆమె రోగుల పాలిట దేవత. ఆమె బీదాబిక్కిని కూడా చూస్తూంటుంది. కానీ ఆయన ఒప్పుకోరు. బీదవాళ్ళకి మంచాలులేవు. అప్పటికప్పుడు చీటీ రాసి యిచ్చి మందులు కొనుక్కోమని చెప్పి పంపేయమంటారు. ఈ విషయంలో ఆయన్ని మెచ్చుకోవలసిందే. కన్సల్టేషన్ ఫీజ్ కోసం కూతుర్ని ఆజ్ఞాపించరు.

పదేళ్ళ నెహ్రూ స్కూల్ నుంచి వచ్చి తల్లికి జరిగిన సంగతులు చెబుతూంటే డాక్టర్ వనిత పరధ్యానంగా వూఁ ఆఁ అంటోంది.

నెహ్రూ నవ్వి 'నువ్వెప్పుడూ యింతే ... చెప్పేదేదీ సరిగా వినవు. నేను తాతగారికి చెబుతాను. మా స్కూల్లో యివాళ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ అనే ఆయన వచ్చారని' అన్నాడు.

వనిత కొరడాదెబ్బ తగిలినట్లు ఉలిక్కిపడింది.

నెహ్రూ చేతిలో వున్న అల్యూమినియమ్ బాక్సు సోఫాలోకి విసిరేశాడు. ఆరుబయట గార్డెన్ చైర్‌లో కూర్చున్న రావుగారి దగ్గరకి పరిగెత్తుకుని వెళ్ళాడు. మనవడు రావడం బూట్ల శబ్దంవల్ల గ్రహించారు ఆయన. చదువుతున్న పేపర్ పక్క కుర్చీలో పడేసి కళ్ళజోడు సవరించుకుని మొహం నిండా నవ్వు పులుముకుని రెండు చేతులూ చాపారు. 'ఓయ్ ... ఏమిటోయ్ యీ పరుగులూ హడావుడి? ఏమిటి విశేషం ?' అని అడిగారు.

నెహ్రూ సగం ఆయాసంతో రొప్పుతూ, సగం ఖంగారులో మింగేస్తూ మొత్తానికి వార్త



# డాక్టర్ వనిత

చెబుతున్నారు 'ఇవాళ మా స్కూల్‌కి మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ వచ్చారు ప్రొద్దున్నుంచీ మా క్లాస్ పిల్లలం అందరం ఆయన్ని చూడాలని తెగ ఎదురుచూశాం. ఆయన వచ్చారు కానీ...'

'ఊఁ కానీ...'

కానీ మేం అనుకున్నట్లు లేరు ఆయన తాతా నెహ్రూ వేసుకునే కోటు వేసుకున్నారు తెలకాం టోపీ, చాలా బావున్నారు తాతగారూ! కానీ గాంధీతాత అంత లేరు.'

'కొంపముంచి మీరు గాంధీగారే అనుకున్నారేమిటి?' నవ్వు ఆపుకుంటూ అన్నారు రావుగారు.

'ఎగ్జాక్ట్లీ! మేము నిజంగా అలాగే అనుకున్నాం కానీ ఆయన కాదు ఆయన వేరు, ఈయన వేరు.'

'తరువాతేమోయ్ మీరు ఆయనెలా అనుకున్నారు మీరు?'

'ఆయనే అని కాదు గానీండి ఆయన కుమారుడో, మనవడో అనుకున్నాం కానీ ఎవరూ కాదు ఈయన తెలుగులో మాట్లాడారు పెద్ద క్లాసు పిల్లలందరూ చప్పట్లు కొట్టడమే.'

'అలాగా'

'తాతగారూ' నెహ్రూ ఆపేశాడు

'ఊఁ చెప్పవోయ్' అన్నారు రావుగారు.

'రేపు మీరు మా స్కూలుకి రావాలండీ అందరూ పేరెంట్స్‌ని తీసుకువస్తున్నారు మమ్మీ అసలే రాదు ఎప్పుడూ ప్లీజ్ మీరు రండి',

'అలాగే' రావుగారు వివర్ణమైన తన మొహాన్ని పిల్లవాడికి కనిపించనీయలేదు.

నెహ్రూ ఆశించని విధంగా ఆయన జవాబు యిచ్చారు. ఎప్పుడూ రోగంతో బిజీగా వుండే ఆయన నెహ్రూకి నవ్వుతెప్పే ప్రయత్నం చేస్తారు కానీ ఆయన ఆ విధంగా ఏమీ అనలేదు వెంటనే ఒప్పేసుకున్నారు హుషారుగా వెళ్ళిపోతున్న ఆ పసివాడి వైపు దిగులుగా చూస్తూండిపోయారు రావుగారు. దూరంగా యీ మాటలన్నీ స్తంభానికి చేరగిలబడి విన్నది వనిత నెహ్రూ దగ్గరకి రాగానే 'యిటు రా నెహ్రూ' అని పిలిచింది

'ఏమ్మా' అంటూ వెళ్ళాడు అతను

బాత్‌రూమ్ వైపు తీసుకువెళ్ళి బట్టలు మార్పించి తన గదిలోకి తీసుకువెళ్ళింది వనిత నెహ్రూని

'నెహ్రూ' అతి నెమ్మదిగా, సౌమ్యంగా పిలిచింది ఆమె పక్కనే మంచంమీద కూర్చున్న నెహ్రూ తలెత్తి 'చెప్పమ్మా' అన్నాడు.

'సంసారంలో సరిగమలు'లో ప్రభ, రాజబాబు



వనిత గుండె అతి వేగంగా కొట్టుకుంటోంది అదికే గుండెల్ని అదుపులోకి తెచ్చేందుకు ప్రయత్నం చేస్తోంది నెమ్మదిగా అడిగింది నెహ్రూ తలమీద చేయి వేసి 'అదే నువ్వు యిప్పుడు తాతగారితో చెబుతున్నావు చూడు... గాంధీ అని ఆయన ఎలా వుంటారు?' అని అడిగింది

నెహ్రూ తలెత్తి తల్లి మొహంలోకి ఆశ్చర్యంగా చూశాడు ఆమె ఎప్పుడూ యిటువంటి ప్రశ్నలు వేయదు ఆమె మొహంలో దిగులు అల్లి కట్టుకున్నది. నెమ్మదిగా అన్నాడు 'ఏమ్మా ఎందుకు? ఆయన చాలా బాగుంటారు? మా ఫ్రెండ్ సునీల్ వాళ్ళ నాన్నగారంత వుంటారు'

'అలాగా' వనిత అదురుతున్న గుండెకి ధైర్యం చెప్పి ఏ అలజడి కనిపించనీయకుండా 'రేపు ఫంక్షన్‌కి నేను వస్తాను తాతగారితో చెప్పు' అంది

నెహ్రూ ఆమె వైపు విచిత్రంగా చూసి 'నువ్వు... నువ్వు వస్తావా మమ్మీ' ఆ మాట అని మంచంమీద నుంచి క్రిందికి దూకేసినంత పని చేశాడు. తలుపులు తోసుకుంటూ రావుగారు వున్న గదివైపు పరుగుపెట్టాడు

వనిత మంచంమీదికి వాలిపోయింది ఆమెకి గతం కనిపిస్తోంది

'పిల్లలు...నువ్వు వెళ్ళద్దు!' శ్రీదేవి కంఠం పెద్దదిచేసి శాసిస్తున్నట్లు అంది.

'వెళ్ళొద్దు వనితా! నీకు నేను ఏ లోటూ రానివ్వను. నువ్వు అతని దగ్గరకు వెళ్ళడం మాకెవరికీ యిష్టంలేదు.' నరహరి అన్నాడు.

పిల్లవాడిని భుజాన వేసుకున్న వనిత కళ్ళు వర్షిస్తున్నాయి. ఆమె వేణుగోపాల్‌గారి గదిలోకి వెళ్ళింది. ఆయన ముభావంగా ఏమీ మాట్లాడలేదు.

'నేను వెళ్ళొస్తాను తాతగారూ!' అంది వనిత.

'వెళ్ళు.' ఆయన యిటు తిరిగి అమెవైపు చూస్తూండిపోయారు. ఆయన కళ్ళల్లో అల్లుడి పట్ల ద్వేషం కనిపిస్తోంది. వనిత యీ నిర్ణయం యెందుకు తీసుకుందో యెవరికీ అర్థంకాలేదు.

వనిత అటునుంచి యామిని గదిలోకి వెళ్ళింది. ఆమె ఎప్పుడూలేనిది వెక్కి వెక్కి ఏడుస్తూ కనిపించింది. వనిత ఆమె మొహాన్ని తనవైపుకి తిప్పుకుని 'నేను వెడుతున్నానమ్మా నాన్నగారి దగ్గరకి.' అంది.

ఆమె కూతుర్ని రెండు చేతులతో కౌగిలించుకుని బావురుమంది.

వనిత ఆమెతో నెమ్మదిగా అంది: 'నువ్వు వస్తే నాన్నగారు కాదనరమ్మా! ఆయన నిన్ను ఎప్పుడూ తలుస్తారు.'

'హుఁ! నేను రావడం, ఆయన తలవడం యివి రెండూ జరగనివి. ఆయన రమ్మని పిలిచినా నాకిష్టంలేదు ఆయనమీద ప్రేమలాంటిదేమీ లేదు. భార్యగా సేవ చేసేందుకు సిద్ధంగా లేను నేను. మా నాన్న నాకోసమే బ్రతుకుతున్నారు. ఈ యింట్లో నన్ను అందరూ బాగానే చూశారు. ఈ వయసులో యింకా ఏం మిగిలిందని నా ధర్మ అంటూ వచ్చేందుకు.'

( 34 వ పేజీ చూడండి)

# గోద్రెజ్ స్టోర్‌వెల్

## ఈ స్టీల్ అల్మారాలకు సరితూగేలాగ తయారు చేద్దామని ప్రయత్నం మిగతా వాళ్ళంతా!

దీని లోపల ప్రత్యేకమైన లాకర్ డిజైను వల్ల మీకు అదనపు రక్షణ.

కొన్ని ఏళ్ళుగా గోద్రెజ్ వారు అత్యున్నతమైన స్టీలు అల్మారాలు తయారు చేస్తున్నారు. నిజానికి స్టాండర్డ్ స్టోర్‌వెల్ శ్రేణిలో 6 రకాలు. స్టోర్‌వెల్ మైనర్ శ్రేణిలో రెండు రకాలు—ఈ మధ్యనే స్టోర్‌వెల్ కాంపాక్టు పూర్తి శ్రేణి తయారు చేశారు. అంతేగాక, అన్నిటికన్న ఎక్కువ జాగా గలిగిన, ఆధునికంగా రూపొందించిన స్టోర్‌వెల్ వాటితోపాటు చేర్చారు.

ఇప్పటిదాకా మిగతా వాళ్ళు గోద్రెజ్ నాణ్యతతో సరితూగేలాగ తయారు చెయ్యాలని ప్రయత్నం—గోద్రెజ్ డిజైనుతో సరిసమానంగా ఉండేలాగ చెయ్యాలని. కాని మేమే ఎప్పుడూ ముందంజ వేస్తున్నాం. నిజానికి ఇది కష్టసాధ్యమే. అయినా, పడ్డ శ్రమకు ఫలితం ఉంది మరి. మీకు ఎంతో మేలైన స్టోర్‌వెల్ అల్మారా ఇవ్వటం మా ధ్యేయం అయినప్పుడు ఇది మరీ ముఖ్యమని మా ఉద్దేశ్యం.

నిజానికి చూస్తే, మా పద్ధతి మొదట్నుంచీ ఇదే.

స్టోర్‌వెల్ అల్మారాని అంతర్గతంగా బలంగా ఉండేలాగ చెయ్యటంతో మొదలైంది ఇదంతా. మృదువుగా ఉండే మెరిసే పెయింట్ పొరల వెనక, తుప్పు నిరోధించే, జీవితాంతం నిశ్చింతగా పనిచేసే ఆకారం ఉంది.

అధిక భద్రత కోసంగాను సునిశితమైన పద్ధతితో కొత్తగా 'కి-వే బోల్టింగ్ డివైజ్' రూపొందించి, దానికి ఎవ్వరూ తియ్యలేని గోద్రెజ్ తాళాన్ని బిగించాము.

మరికొన్ని కొత్త సదుపాయాన్ని అమర్చాం దీనిలో. స్పెషల్ ఛానల్ గ్రిప్ లాకర్, ఎవ్వరూ పగలగొట్టలేని తలుపు బందులు, దాని తోపాటు గుండ్రని చివరలు పొందుపరిచాము.

మేము కొత్తది ఏదైనా ప్రవేశపెడితే చాలు, మిగతా వాళ్ళు దానినే అనుసరించటం సమంజసంగా భావించారు.

కాని అది అంతవరకే—వాళ్ళు అంత తేలికగా అనుసరించడానికి వీల్లేని కొన్ని అంశాలున్నాయి మరి.

మేము తయారుచేసే ముఖ్యమైన ప్రతి స్థాయిలోనూ నూటికి నూరు పాళ్ళు పర్యవేక్షణ అందులో ముఖ్యమైన అంశం—మరొకరు అనుసరించటం అంత తేలిక కానిది అది.

కొత్త పద్ధతులు కనిపెట్టడంలో గోద్రెజ్ వారి ఉత్సాహంతో కూడిన కౌశలం మరొక అంశం.

మేము తీసుకొచ్చే వికాసాన్ని బలపర్చడానికి పూర్తి సౌకర్యాలున్న మా పరిశోధనా విభాగం మాకున్న ప్రత్యేకతల్లో మరొకటి.

నిజానికి చూస్తే, నాణ్యత విషయంలో అందరికన్న మేమే మా ముఖ్యమైన ప్రతిస్పర్థులం.



స్టోర్‌వెల్ మోడల్ 1
—దిగుమతి చేయబడిన నిలువుటద్దం
—మీ రూపాన్ని పూర్తిగా చూసుకోవడం కోసం వీలైనది.



స్టోర్‌వెల్ మోడల్ 2

కొత్త స్టోర్‌వెల్ 'వార్డ్‌రోబ్': స్టాండర్డ్ సైజు దానికన్నా ఎక్కువ లోతైనది, విశాలమైనది. అంటె సూట్ల కోసం, బట్టల కోసం మరింత ఎక్కువ జాగా లోపలే లాకర్ ఏర్పాటు, మార్చుకోవడానికి వీలైన అరలతో.



### కొత్త 'కాంపాక్టు' అల్మారాలు



స్టాండర్డ్ స్టోర్‌వెల్ అంత లోతు, స్టోర్‌వెల్ నాణ్యతతో. అదిగాక మీరు ఎంచుకోవటానికి ఆరు డిజైన్లు. అయినా కొంచెం పొట్టిగా, కొంచెం కోసుగా—తక్కువ జాగా వున్నప్పుడూ, పరిమితమైన ఖర్చు చెయ్యగలిగిన ఇల్లుగల వాళ్ళ కోసం ఎంతో వీలు.



స్టోర్‌వెల్ మైనర్
—లాకర్‌తో గాని లేదా లాకర్ లేకుండా గాని.

ప్రఖ్యాతి చెందిన వస్తువులు నిర్మించేవారు—
గోద్రెజ్
Godrej

### ఉచితం!

గోద్రెజ్ స్టోర్‌వెల్ ఫోల్డర్

వివరాలకు వ్రాయండి:
గోద్రెజ్ అండ్ బాయిస్ మేన్యు. కం. ప్రై. లి.
4ఎ, హోమ్ స్ట్రీట్, ఫోర్ట్, బొంబాయి 400 001.

స్టోర్‌వెల్—నాలుగు అరలు గలది ఇప్పుడు కేంద్ర ప్రభుత్వ శాఖలకు డి.జి.ఎస్. అండ్ డి. రేట్ కాంట్రాక్టు ద్వారా లభ్యమవుతోంది.

U-GS-16-6 TEL

# నా కొడుకు దొంగ కాదు

చిటిప్రోలు వేంకటరత్నం



"ఎవరండీ లోపల ?"

ఉలిక్కిపడ్డాడు ఎంకటేసు. మెల్లగా లేచి వెళ్లి తలుపు తీశాడు.

"ఎవురు గావాల బాబూ ?"

"వేంకటేశ్వర్లంటే మీరే కదూ ?" అడిగాడు తెల్లపాంటు, నల్ల చొక్కా వేసుకున్న అబ్బాయి. ఆ అబ్బాయితోపాటు ఇంకో కుర్రాడు కూడ లోపలికి వచ్చాడు. చారల పాంటు, పూల చొక్కా తొడుక్కున్నాడు.

"నేనే బాబూ" సాలోచనగా అన్నాడు ఎంకటేసు.

అతడి ఆర్థిక స్థితి తెలుసుకోవడానికి 'ఎంకటేసు' అన్న పేరులోని నిరాడంబరత్వమే చాలేమో ! గోడలు వెలిసిపోయిన పూరిల్లు, కొద్దిగా నగదు, రోజువారీ కూలీ తప్ప ఎంకటేసుకు వెనకా ముందూ ఏమీ లేదు.

"ఇంతకీ మీ రెవురు బాబూ ?" అడిగాడు ఎంకటేసు.

"నన్ను 'వాసు' అంటారు. వీడి పేరు 'రాజు'. ఈ ఊళ్లోనే హాస్టల్‌లో ఉంటూ కాలేజీలో చదువుకుంటున్నాం" చెప్పాడు వాసు ఎంకటేసు చూపించిన బల్లమీద కూర్చుంటూ.

మంచానికి ఒక చివర సున్నితంగా కూర్చున్నాడు 'రాజు' అనబడే కుర్రాడు.

"చూడండీ, మీరు బాధపడతారేమో..."

"అట్టాంటిదేం లేదులే సెప్పు బాబూ."

ఒక్క క్షణం ఎంకటేసు కేసి పరిశీలనగా చూశాడు వాసు. లోతుకు పోయిన కళ్లు... వీపు కంటుకుపోయిన పొట్ట... కుష్కించిన శరీరం... ఎంత దయనీయంగా ఉన్నాడో ఎంకటేసు !

మనసులోనే ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"కోటిలింగమంటే మీ అబ్బాయే కదూ !"

"ఔన్నాయనా. ఆడ్నొకొక్కగానొక్క నలుసు. ఏం జేసిండాడు ?"

చెప్పాడు వాసు.

ఎంకటేసు హడలిపోయాడు.

తన కొడుకు దొంగా ! ?... వాడికి తనేం లోటు చేశాడని !... లేదు. అలా జరగడానికి వీల్లేదు. ఇదెవరో గిట్టనివాళ్లు అల్లిన అబద్ధమై ఉంటుంది. అంతే.

అదే వెల్లబోసుకున్నాడు వాసుతో.

"అలా అంటే ఎలా అండీ ? కళ్లముందు ప్రత్యక్షంగా కనబడుతుంటే."

"ఏదైనా సరే. ఇది నిజం గాదు. పచ్చి అబద్ధం" కొంచెం గట్టిగానే అన్నాడు.

రాజు తొందర పెట్టాడు.

"మాటల కిది సమయం కాదండీ. వెంటనే మీరక్కడికి రాకపోతే అతగాణ్ణి చావబాదేట్లున్నారు మావాళ్లు."

ఇక చేసేది లేక హడావిడిగా బయలుదేరాడు ఎంకటేసు. మేకుకు వ్రేలాడుతున్న ముతక చొక్కాను ఒంటికి తగిలించుకొని ఉన్నపాటున్నట్లే ప్రయాణమయ్యాడు.

"నా కొడుకు కట్టాంటోడు కాదు నాయనో" అని బావురుమంది అప్పటిదాకా గోడవారగా నిల్చుని విస్మయంతో చూస్తున్న మాణిక్యమ్మ – ఎంకటేసు పెళ్లాం.

భార్యకు ధైర్యం చెప్పి కుర్రాళ్లిద్దరితో బయలుదేరాడు ఎంకటేసు.

దారిపొడుగునా ఎంకటేసు గుండెల్లో అగ్ని పర్వతాలు బ్రద్దలౌతూనే ఉన్నాయి.

ఎలాగైతేనేం గమ్యాన్ని చేరుకున్నారు.

వాతావరణం అంతా గందరగోళంగా ఉంది. ఎంకటేసును చూడడంతోటే అందరూ తప్పుకున్నారు.

ఎంకటేసు కొడుకును సమీపించాడు. కొడుకు నా స్థితిలో చూస్తుంటే కళ్లల్లో నీళ్లు తిరిగాయి ఎంకటేసుకు... వరండాలో స్తంభానికి కట్టివేయబడి ఉన్నాడు తన కోటిగాడు !

"ఏరా కోటీ ! నీకీ పాడుబుద్ధెందుకు పుట్టిందిరా. నీకేం తక్కువైందని ఈ తలొంపుల పనికి పూనుకుంటివి ?"

కోటిగాడు మాటాడలేదు. ముఖం త్రిప్పేసుకున్నాడు.

మెల్లిగా గడ్డం పైకెత్తి లాలనగా అడిగాడు. "ఎందుకు జేసినవీ పని సెప్పు. ఎవురైనా సెప్పిరా లేక నీకు నువ్వే సేసినవా."

సమాధానం లేదు.

గుంపులో నుంచి ఎవరో కర్తవ్యం గుర్తు చేశారు.

"అసలా గడియారమేం చేశాడో చెప్పమనండి. ఆ తర్వాత సంగతి ఆలోచిద్దాం."

అర్థింపుగా అడిగాడు ఎంకటేసు. "పోనీ, అదైనా సెప్పరా."

"... ... ..."

ఎంకటేసు పరి పరి విధాల బ్రతిమాలాడు కొడుకును. కోటిగాడు నోరు మెదపలేదు.

"ఇలా బ్రతిమాలితే లాభంలేదండి. గదిలో కెత్తుకెళ్లి ఆ చెంపా యీ చెంపా వాయిస్తేగాని నిజం కక్కడు." అరచారెవరో ఉడుకుపిండం.

ఇంకేముంది ! కోటిగాణ్ణి ఎత్తుకొని అమాంతం గదిలోకి వట్టుకెళ్లారు. రాజు, వాసు, ఎంకటేసు వారించినా వినలేదు. ఎంకటేసును బయటే వుండమన్నారు.

ఎలాగో కష్టపడి కోటిగాడి నోట నిజం కక్కించారు.

"పొద్దున్న పేకాటలో . ఓడిపోయినా. మాపటేలకి పైసలట్టుకు రాకుంటే మక్కెలిరగ దంతానన్నాడాడు. గడియారం బాకీ కింద ఆడికిచ్చేసినా. ఆ డిప్పు డేడున్నాడో తెలవదు." చెప్పాడు కోటిగాడు.

రాజు యీ విషయం ఎంకటేసుకు చెప్పాడు.

ఎంకటేసు హతాశుడయ్యాడు.

ఏమిటీ ! తన కొడుకు కిలాంటివాడా ! తన కింతవరకు తెలీదే ! ఒక్కగానొక్క నలుసని కంటికి రెప్పలా చూసుకున్నారు భార్యాభర్తలిద్దరూ. ఆ గారాబమే వాణ్ణి ఈ రోజు కిలా తయారు చేసిందేమో !

కోటిగాణ్ణి వానా చీవాట్లూ పెట్టాడు.

కోటిగాడు దేనికీ ఉలకలేదు, పలకలేదు.

ఇప్పుడిప్పుడే వాడి మనసులో పశ్చాత్తాపం రగులు కుంటున్నట్లుంది.

అసలు తనెందుకిలా చేశాడు ? ప్రపంచంలో తనంత దౌర్భాగ్యు లుంటారా ? తండ్రి తనకు పంచియిచ్చిన ప్రేమానురాగాలకి తను ప్రతిఫలంగా చేసిందేవిటి ? నలుగురిలో ఆయన పరువు మంట గలపడం. తన్ను కన్నందుకా తల్లిదండ్రు లెంతగా ఆక్రోశిస్తున్నారో.

కోటిగాడి బుర్రలో గతం అంతా గిర్రున తిరిగింది.

కోటిగాడికి మొదటినుంచీ కోరిక లెక్కువ. తను పెద్ద ఆఫీసరైపోవాలని, పెద్ద పెద్ద వాళ్లందరూ తన కటాక్షంకోసం పడిగాపులు కాయాలని, కలవాళ్లమ్మాయిని చేసుకుని గర్వంగా బ్రతకాలని ... యెన్నో కలలుకనేవాడు. కాని తండ్రి ఆర్థిక పరిస్థితులు అందుకు 'ససేమిరా' అన్నాయి. అయిదో తరగతితోనే చదువుకు 'బ్రేక్' పడింది.

చదువైతే ఆగిందికాని కోటిగాడి అంతరాంత రాలలోని 'ఆశ' యింకా నిద్రపోలేదు. పట్నంలో బరబరలాడే కార్లూ, ఘరానా మనుషులు వాడి మనసును తొలిచేస్తూనేవున్నారు. వాళ్లను చూచినప్పుడల్లా, వాళ్లలా చదువుకోకపోయినా డబ్బైనా సంపాదించాలనిపించేది పన్నెండేళ్ల కోటిగాడికి. వ్యాపారం చేయడానికా — తన కంత తాహతులేదు. మరేం చెయ్యాలి ? వాడి లేత మనసులో పేకాట మిగిలింది. అంతే ... దానికి దాసుడయ్యాడు.

ఇక వాడేం చేస్తున్నాడో, ఎలా తిరుగుతున్నాడో తెలుసుకుని దిద్దుకునే శ్రద్ధ, తీరిక తండ్రికి లేవు. తల్లికా — వాడంటే వల్లమాలిన ప్రేమ. ఇలా కొంత ప్రేమ, కొంత అశ్రద్ధ కలిసి వాడి జీవితాన్ని ఈ మలుపు త్రిప్పాయి. చెడిపోయాడు.

ఎవరో తనను భుజం తట్టి మందలించడంతో ఈ లోకంలోకి వచ్చాడు కోటి

గడియారం పోగొట్టుకున్న కుర్రాడు కాబోలు తండ్రిని అడుగుతున్నాడు. "కొత్తది కొనాలంటే నూటయాభై అవుతుందండీ. చాల కాలం వాడు కున్నాను కాబట్టి నూటపాతిక ఇవ్వడం న్యాయ మనుకుంటాను."

ఎంకటేసు కొడుకు వైపు చూశాడు. సిగ్గుతో తల దించుకున్నాడు కోటి

చర్చించుకోవడాలన్నీ అయిన తరువాత నూట పాతిక ఇవ్వడమే సబబు అన్నారందరూ. ఎంకటేసుకూ అలాగే అనిపించింది.

కోటిని తీసుకొని ఇంటి ముఖం పట్టాడు.

"... యెంటెవురైనా రండి బాబూ. పైస లంపుతా..."

... ఎంకటేసును అనుసరించాడు.

ఎంకటేసు మాటైతే అన్నాడుగాని గుండెల్లో రైళ్లు ...రుగెత్తుతూనే ఉన్నాయి.

... కప్పించడానికి పైస లవసరమై మాణిక్యమ్మ మెళ్లో తాళి తాకట్టు పెట్టి వంద రూపాయ...లు తెచ్చాడు తను. ఆ కాస్త డబ్బూ వీడు చేసిన ఎధవ పనికి తగలబెట్టవలసివస్తుంది. పైగా తల తీసేసినంత అవమానం.

కుమిలిపోయాడు ఎంకటేసు.

ఏం చేస్తాడు ! మచ్చుమీద పెట్టెలో ఉన్న వంద రూపాయలకు మరో పాతిక కలిపి వాసు చేతిలో పెట్టాడు.

"పేదోళ్ల బతుకులకి తగ్గట్టే ఉంటాయి బాబూ ఆల్ల బుద్దులు కూడ."

వాసుకు మనసు బరువెక్కింది. పైకం లెక్క పెట్టుకొని, తల వంచుకు వెళ్లిపోయాడు.

కోటిగాడు వాసు వెళ్లినవైపే గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు. తండ్రి అన్న మాటలు వాడి హృదయం మీద ఊంపపు పళ్లలా పనిచేశాయి.

. తను తొమ్మిది గంటలకే హాస్టలుకు వెళ్లడం... "మా యాజమానిగా రబ్బాయి కోసం వచ్చా"నని అబద్ధం చెప్పడం... ఎవరూ చూడ కుండా గూట్లోని గడియారాన్ని జేబులో వేసు కోవడం... ఒకదాని తరువాత ఒకటి పుస్తకంలో పుటల్లా తిరిగిపోయాయి కోటిగాడి మెదడులో. వెదుక్కుంటూ వెళ్లి, గడియారం బాకీ కుర్రాడి కప్పజెప్పి వచ్చాడు. గడియారంతోపాటు తనూ పోతే తనమీద అనుమానం రావచ్చుననే ఉద్దేశంతో మళ్లీ అక్కడికే వెళ్లాడు. నిజంగానే ఆ రూమ్‌లోవాళ్లు తనను అనుమానించారు. తనను అడిగిన ప్రశ్నలకు అస్తవ్యస్తంగా సమాధానాలు చెప్పి దొరికిపోయాడు.

అలా పట్టుబడడం కూడ తన మంచికేనేమో ! అనుకున్నాడు కోటి.

ఈ సంఘటనే జరగకపోతే తను ఇంకా ఎలా మారి ఉండేవాడో !

కోటిగాడు మనసు ఉండబట్టలేకపొయ్యాడు.

"ఇట్టాంటి తప్పుడు పని జల్మలో ఎప్పుడూ సెయ్యనయ్యా" అనేశాడు దిగాలుగా మంచంమీద కూలబడ్డ తండ్రి కళ్లల్లోకి చూడలేక చూడలేక చూస్తూ.

ఎంకటేసు కొడుకును కౌగిలించుకొని ప్రేమగా తల నిమిరాడు.

"కోటీ! ఎట్టాంటి పన్జేసినవురా" అని బొబ్బలుపెడుతూ లోపలినుంచి వచ్చింది మాణిక్యమ్మ.

ఎంకటేసు ఆపడానికి యత్నించాడు.

మాణిక్యమ్మకు ఉక్రోషం ఆగలేదు.

"ఏం జల్మరా నీది. పాడు జల్మ. ఇట్టా... బుద్ధితక్కువ పన్జేసేబదులు ఆల్ల బాయిలో ప... సావకపోతివేరా. మా కింత అప్రెదిష్ట లేకపోను...'

కోటిగాడు తల్లిని కౌగిలించుకుని భోర మన్నాడు.

మాణిక్యమ్మకు హఠాత్తుగా ఒగిరింపు ఎక్కు వైంది. నిటారుగా నిలబడలేకపోయింది.

"ముదనష్టపు గుండె నెప్పి మల్లా వొచ్చిందా మాణిక్యం" అంటూ ఎంకటేసు మాణిక్యమ్మను తీసుకువెళ్లి మంచంమీద పడుకోబెట్టాడు మెల్లిగా. కోటిగాడు కూడ సాయం చేశాడు.

మాణిక్యమ్మకు ఉద్రేకం ఎక్కువైనప్పుడల్లా ఇలా నొప్పి రావడం మామూలే. ఇప్పుడు కొడుకు ప్రవర్తనకి మరీ ఎక్కువైంది.

"కోటీ! ఇంక నేను బతకన్నా. బుద్ధిగా మసులుకుంటూ అయ్యను సూస్తుండు."

అంతవరకూ కోటిగాడిమీద ఉన్న క్రోధం ఎటు పోయిందో మరి !

మాణిక్యమ్మ మాటలు విని ఎంకటేసుకు గుండె ఝల్లుమంది.

"అయ్యేం మాటలే మానిక్కెం. ఇప్పుడే... వొచ్చిందని" అన్నాడు ఎలాగో

మాణిక్యమ్మ రెండు చేతులూ ఎత్తి ఎంకటేసుకు దండం పెట్టింది.

"ఎల్లిపోతున్నా మావా" అంది.

భర్తను, కొడుకును చెరొక చేత్తో గట్టిగా పట్టుకుని పైకి లేవబోయింది. కాని శక్తి చాలక అలాగే వెనక్కు వాలిపోయింది. అంతే!... ఆమె ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమయ్యాయి.

తండ్రి కొడుకు లిద్దరూ ఒక్కసారిగా గొల్లు మన్నారు.

ఎంకటేసు వెక్కి వెక్కి ఏడుస్తూనే కొడుకు వైపు చూశాడు. "నువ్వగ్గేనంలోంచి కళ్లు తెరిసే వొరుకు మీ అమ్మ తన కళ్లు మూసేస్కుందిరా."

కోటిగాడు స్థాణు వయ్యాడు.



## యిస్తున్న "సుధ" నటిస్తున్నవి

పోషిస్తున్న పాత్రలను బయిస్తున్న "సుధ"ను విస్యత్తు వున్న వుత్తమ నటిగా పేర్కొనవచ్చు.

ఒక నటికి కావలసిన ఫేస్, గ్రేస్ ఫ్లస్ టూ ప్రాభవం వున్నది గాబట్టి, జయసుధను ఫ్యూచర్‌హోప్"గా చెప్పగలుగుతుంది, ఈ కలం.

"వటుప్రమాట్" కూడా "జయ"ను హౌస్ ఫుల్" స్టార్‌గా దీవించారు రోజా మెకొప్పే వుత్తరాలు కూడా అలాంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తున్నాయి.

"జయ"కు అవున్నత్యాన్ని తెచ్చిపెట్టిన జ్యోతి" పాత్రను మరిపించే పాత్రను దుక్కిపాటి మధుమాధవరావుగారి "ప్రేమలేఖలు" చిత్రంలో ఇస్తున్నది.

కొన్ని పాత్రల్లో అబ్లిగేషన్ కోసం చెయ్యక తప్పదు, ఏ ఆర్టిస్టుకైనా. వాటిపై మోజుపడి చెయ్యడం మాత్రం కాదు. అవి అభిమానులకు నచ్చుతాయి, జయసుధ

ప్రస్తుతం జయసుధ నటిస్తున్న చిత్రాలు.

"అన్నపూర్ణా పిక్చర్స్ వారి ప్రేమలేఖలు, ఎ.వి. ఎస్. ప్రొడక్షన్స్‌వారి కలర్ చిత్రం, లలితా మూవీస్‌వారి ఇదెక్కడి న్యాయం, ... యింటర్నేషనల్‌వారి మొరటోడు, శ్రీ రమణ ... దూ...దూ. బసవన్న, సత్య చిత్ర ... కలర్ చిత్రం, ఇందిరా మూవీస్‌వారి వర్ణ చిత్రం, మారుతి కంబైన్స్‌వారి కొత్త కలర్ చిత్రం, ... బుజ్జి ప్రొడక్షన్స్‌వారి ఓ మై ... వర్ణచిత్రం"

### విక్కు విడదీసిన విస్మారి

తెలుగులో ప్రముఖ స్థానాన్ని స్వయం కృషితో సంపాయించుకున్న జయసుధను ఒక "విక్కు ప్రశ్న" వేశాం.

సడన్‌గా ధర్మేంద్ర, దేవానంద్, అమితాబ్ గార్ల సరసన నాయిక వేషం వస్తే... ?

'రాజా'లో శోభన్‌బాబు, జయసుధ

"తెలుగును మర్చిపోయి మాత్రం ఎగబడను. కాల్‌షీట్లు కుదిరితే తప్పకుండా "యెస్...కాను", అంది జయసుధ

### రెండు చిత్రాలలో వన్ అండ్ టూ

అగ్రనటి వాణిశ్రీ, యువతరం మెచ్చిన జయసుధ కలిసి రెండు చిత్రాలలో నటిస్తున్నారు

ఒకటి మారుతీ కంబైన్స్‌వారి వర్ణచిత్రం. (కృష్ణంరాజు కథానాయకుడు) రెండు. ఇందిరా మూవీస్‌వారి వర్ణచిత్రం (ఎన్టీఆర్ కథానాయకుడు).

### జయసుధకు యోగ్యతాపత్రం

ప్రముఖ చిత్ర నిర్మాత శ్రీ దుక్కిపాటి నిర్మిస్తున్న నవలా చిత్రం "ప్రేమలేఖలు" ... షెడ్యూలు పూర్తయ్యే ... వస్తుంది.

ఇరవై అయిదేండ్లు మంచి చిత్రాలను నిర్మిస్తున్నారు, మధుసూదనరావుగారు. ఎప్పుడు కూడా యింత "క్విక్" చిత్రాన్ని ఆయన నిర్మించిన అలవాటు లేదు.

నవంబర్ యిరవై మంచి, డిసెంబర్ యిరవై ఎనిమిది వరకు అంటే (నెలా ఎనిమిది రోజులు) ఒకే షెడ్యూలు జరపడం, దుక్కిపాటిగారికి యిదే తొలి అనుభవం.

"ప్రేమలేఖలు" చిత్రం విజయవంతమయితే, జయసుధ మార్కెట్టు మరింత పెరుగుతుంది అనెడి అభిప్రాయాన్ని అన్నపూర్ణా పిక్చర్స్ అధినేత వెల్లడించారు.

జయసుధను మంచి నటిగా, సిన్సియర్ నటిగా ఆయన పేర్కొన్నారు.

"ప్రేమలేఖలు" చిత్రంలో అనంతనాగ్, దీప రెండు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు పాత్రకు ఎవరయితే సరిపోతారో, వారిని ఎంపిక చేశారు, దుక్కిపాటిగారు.

విఖ్యాత రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన మరొక వుత్తమ రచన "ప్రేమలేఖలు"కు సత్యానంద్ సంభాషణలను సమకూర్చారు.

యువ దర్శకుడు రాఘవేంద్రరావును దుక్కిపాటిగారు ఘనంగా మెచ్చుకున్నారు. సెట్లో రాఘవేంద్రరావు తీసుకునే శ్రద్ధ, శ్రమను కొనియాడారు. ఆయనకు వుజ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తున్నారు, దుక్కిపాటి.

"ప్రేమలేఖలు" చిత్రంలో జగ్గయ్య, మురళీమోహన్, గిరిబాబు, అల్లు రామలింగయ్య, శుభ, సత్యనారాయణ ప్రధాన పాత్రధారులు అన్నపూర్ణా పిక్చర్స్‌వారి రజతోత్సవ చిత్రం "ప్రేమలేఖలు" కొత్త సంవత్సరంలో నవయుగ ద్వారా విడుదలవుతుంది.



'మంచికి మరో పేరు'లో [illegible] రామకృష్ణ

## జయలక్ష్మికి ప్రముఖుల ఆశీస్సులు

"స్వర్గం—నరకం"లో హీరోయిన్‌గా నటించి, "అంతులేని కథ"లో ఫటాఫట్ పాత్రను బహు చక్కగా పోషించి, అప్పటినుంచి ఫటాఫట్ జయలక్ష్మిగానే అందరిచేత పిలువబడుతున్న జయలక్ష్మిని ప్రఖ్యాత తమిళకవి కన్న దాసన్ ఒకానొక సభలో ఇలా అభినందించారు. "తిరమైయుళ్లనడిగై జయలక్ష్మి అవళ్ ఒరు సిరందనడిగై. అవళ్ నడిత్త పడ మల్లాం మూన్రాండు వియావై నడిత్తి కొళ్వదు ఎనక్కు మిగ మగళ్చియాగి ఇరుక్కిరదు. అవళ్ ఇదుపోలవే పల్లాండువాందు, పలపేరుడియ ఆశీర్వాదత్తై పెరవేండు మెండ్రు వాయత్‌కిరేన్" కన్నదాసన్‌గారు వెలిబుచ్చిన ఆ సదభిప్రాయం తెలుగులోకి అనువదిస్తే ఇలా వుంది "జయలక్ష్మి చక్కటి నటి జయలక్ష్మి నటించిన తమిళ చిత్రాలన్నీ మూడురోజుల పండుగను జరుపుకోవడం నాకెంతో ఆనందంగా వుంది. జయలక్ష్మి ఇంకా ఇంకా మంచి చిత్రాల్లో నటించి, మరింత మంది ఆశీర్వాదాన్ని పొందాలని ఆశిస్తున్నాను."

దర్శకుడు దాసరి నారాయణరావుగారి గృహప్రవేశం రోజు అక్కడికి వేంచేసిన పెద్దల్లో బి నాగిరెడ్డిగారొకరు. జయలక్ష్మి కూడా ఆ ఫంక్షన్‌కు అటెండ్ అయింది. నాగిరెడ్డిగారు "స్వర్గం—నరకం" చిత్రం చూచి, ఆచిత్రంలో నటించిన జయలక్ష్మిని బహుధా ప్రశంసించడం జరిగింది. గృహప్రవేశం రోజు జయలక్ష్మిని నాగిరెడ్డిగారు చూడడం తటస్థించింది. ఆ అమ్మాయిని దగ్గరికిపిల్చి "అమ్మాయ్, చాలా బాగా చేశావమ్మా! నీకు మంచి భవిష్యత్తు వుంది" అని మనసారా జయలక్ష్మిని దీవించారు.

నాగిరెడ్డి, కన్నదాసన్‌గార్లన్న మాటల్లో ఎంతో నిజముంది. నటనలో యిప్పుడున్న ఎవ్వరికీ తీసిపోదు జయలక్ష్మి జయలక్ష్మిలో గ్లామర్ లోపించిందా అంటే అదీలేదు. యాక్టింగ్ + గ్లామర్ రెండూ వున్నాయి జయలక్ష్మికి కానీ వేషాలు మాత్రం జయలక్ష్మిని వరించడంలేదు. జయలక్ష్మికి తెలుగులో తక్కువ చిత్రాలున్నా, తమిళంలో దాదాపు పది చిత్రాలదాకా వున్నాయి. జయలక్ష్మి లాంటి తారలను సరైన పాత్రలకు మనవాళ్లు ఎంపిక చేసుకునే శుభకాలం రాకపోతుందా! తప్పకుండా వస్తుంది. జయలక్ష్మి సెట్లో యెంత చలిపిగా, చిరునవ్వులు చిందిస్తూ, గడబిడ చేస్తుంటుందో, ఇంట్లో అంత కామ్‌గా ఉంటుంది. ఫలానా సెట్లో జయలక్ష్మి వుందంటే అక్కడ సందడే

జయలక్ష్మి ప్రస్తుతం "లంబాడోళ్ల రాందాసు" (కలర్) "ఈనాటి బంధం ఏనాటిదో" (కలర్), "ఏడడుగుల అనుబంధం", "మంచిని పెంచాలి" చిత్రాల్లో వెరైటీ పాత్రలను పోషిస్తోంది.

'ఇంటని దిద్దిన ఇల్లాలు'లో సుజాత, జయసుధ



## కోటారెడ్డి క్రొత్త చిత్రాలు

ప్రేమ్స్ కంబైన్స్‌వారి "సంసారంలో స, రి, గ, మ, లు" చిత్రాన్ని డైరెక్ట్ చేసిన యం. యస్. కోటారెడ్డి రియల్లీ ఎ లక్కీమాన్ పై చిత్రాన్ని ఒకే నెల్లో పూర్తిచేసిన చిన్న వయస్కుడు కోటారెడ్డికి చాలా ఆఫర్లు వస్తున్నాయి. శ్రీ లక్ష్మీ నరసింహా కంబైన్స్ నిర్మించే క్రొత్త చిత్రానికి కోటారెడ్డిని దర్శకుడిగా ఎంపిక చేశారు ఈ చిత్రం షూటింగ్ నవంబర్‌లో ప్రారంభమై డిశంబర్‌కి పూర్తవుతుంది (ఇన్‌డోర్). జనవరిలో కొంత అవుట్‌డోర్ జరుపుకుని, ఫిబ్రవరికి విడుదలకు నిరీక్షిస్తుంది. మార్చి నుంచి ప్రేమ్స్ కంబైన్స్ నిర్మించే రెండవ చిత్రానికి కూడా కోటారెడ్డే దర్శకత్వ బాధ్యతను స్వీకరించాడు. 'మే' కంతా ఈ చిత్రం పూర్తవుతుంది. "మే" నుంచి లక్ష్మి నరసింహావాళ్లు డేట్స్ అడిగినట్టు అధికార పూర్వకంగా తెలుస్తోంది. బందరు నుంచి మరో పార్టీవారు కూడా కోటారెడ్డిని వొత్తిడి చేస్తున్నట్టు, ఆ చిత్రానికి కోటారెడ్డి దర్శకత్వం వహించడానికి సుముఖంగా వున్నట్టు తెలుస్తోంది మరో ప్రముఖ నటుడు కూడా కోటారెడ్డిని తన చిత్రానికి దర్శకుడిగా పెట్టుకోవాలనే ఆలోచనలో వున్నట్టు తెలుస్తోంది. చిన్న వయస్సులోనే ఇంత పాపులర్ కాగలిగిన కోటారెడ్డి, ప్రాప్తించిన ఖ్యాతిని నిలబెట్టుకునే విధంగా తన శాఖలో పని చేస్తారని విశ్వసిస్తున్నాను నవంబర్‌లో "సంసారంలో స, రి, గ, మ, లు" విడుదలవడం, శ్రీ లక్ష్మీనరసింహావారి చిత్రం ప్రారంభం కావడం జరుగుతాయి.

## బాలు అంతస్తు పెరిగింది

గాయకుడిగా ఆబాలగోపాలాన్ని వుర్రూతలూగిస్తున్న బాలసుబ్రమణ్యం మరో క్రొత్త శాఖను చేపట్టారు. క్రొత్త శాఖంటే వేరే యేదో డిపార్ట్‌మెంట్ కాకుండా గాయకుడికి దగ్గరగా వుండే సంగీత దర్శకుడి పదవిని అక్టోబర్ నెల్లో స్వీకరించారు. దాసరి నారాయణరావు కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో స, రి, గ, మ ఆర్ట్స్ బ్యానరుపై టి. కాశీ, వారి మిత్రుడు నిర్మిస్తున్న "పేరు పెట్టని కథ" చిత్రానికి సంబంధించిన తొలి పాట రికార్డింగ్‌ను అక్టోబర్ ఆఖరివారంలో ఒకరోజున జెమినీలో కండక్ట్ చేశారు బాలు ఆనాటి పాటకు బాలు కూర్చిన బాణీ క్రొత్తపుంతలు త్రొక్కిందంటే అతిశయంకాదు. త్వరలో షూటింగ్ ప్రారంభమయ్యే ఈ చిత్రంలో పద్మప్రియ, జయమాలిని, విజయ్‌బాబు నటిస్తున్నట్టు తెలుస్తోంది.



'చక్రధారి'లో రామకృష్ణ, అక్కినేని

# సినిమా

### ప్రొఫెసర్‌గా శ్రీధర్

ప్రముఖ దర్శకుడు సి. వి. శ్రీధర్ ("పెళ్లి కానుక", "మనసే మందిరం" ఫేం) దర్శకత్వంలో సి. వి ఆర్. ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రానికి "సీత గీత దాటితే ." అన్న పేరు పెట్టినట్టు ఆ చిత్ర సారథి పూర్ణచంద్రరావు చెప్పారు. పై చిత్రంలో ఆర్టిస్ట్ శ్రీధర్ ప్రొఫెసర్‌గా నటిస్తున్నారు ఈ ప్రొఫెసర్ మనస్తత్వం ఎలాంటిదన ఎప్పుడూ ఏదో రీసెర్చ్ అంటూ తన కాలాన్నంతా దానికే అంకితం చేసేవాడు కట్టుకున్న భార్యకు కనీసపు కోరిక లుంటాయని కూడా గుర్తించలేడు కానీ నిజానికి పెళ్లాన్ని అసంతృప్తి పరచాలనిగానీ, ఆవేదనకు గురి అయ్యేట్టు చేయాలని కానీ అత నేనాడు వూహించడు. ఈ విషయం అతని కొక్కడికే తెల్సు. ఎదుటివారికీ విషయం ఎలా తెలుస్తుంది భర్త పొద్దస్తం పరిశోధనతో సరిపెట్టుకుం టుంటే, సహనంతో ఎన్నాళ్లని సరిపెట్టుకుంటుంది భార్య! ఇలాంటి చిన్న విషయాలు చిలువలు పలువలై, చివరకు అర్థంలేని అడ్డుగోడలను సృష్టి స్తాయి భార్యా భర్తల మధ్య ప్రొఫెసర్ జీవిత గమనం ఎలాంటి రూపాంతరాలు చవిచూడవలసి వచ్చింది ? ప్రొఫెసర్, అతని శ్రీమతి మధ్య సామరస్యం ఎలా కుదిరింది అనే ప్రశ్నలకు సమాధాన మిస్తూ నిర్మింపబడే చిత్రమే "సీత గీత దాటితే"

నవంబర్ మొదటి వారానికి చిత్రానికి సంబం ధించిన ఇన్‌డోర్ వర్క్ పూర్తవుతుంది నవంబర్ ఆఖరి వారంలో ఉడిపి, హంపి, మున్నగు ప్రదేశాల్లో పాటల చిత్రీకరణ జరుగుతుంది డిశంబర్ మొదటి వారానికి ఎడిటింగ్ వర్క్ పూర్తిచేసుకుని, డిశంబర్ 31వ తేదీ విడుదలకు ముస్తాబవుతుంది అన్నారు దర్శకుడు శ్రీధర్ చిత్రంలో మొత్తం నాలుగు పాట లున్నాయని, నాలుగు పాటలను ఆత్రేయగారే వ్రాసారని తెలిపారు నిర్మాత సి. వి రెడ్డి .

### శ్రీధర్ టేకింగ్ సుపర్బ్!

ఇది నేనన్న మాటలు కావు ప్రసాద్ స్టుడియోలో నిర్విరామంగా జరుగుతున్న "సీత గీత దాటితే" చిత్రం షూటింగ్ చూడడానికని పరిశ్రమతో సంబంధం వున్నవారు, ఆంధ్రా నుంచి యాత్రలకని బయల్దేరిన ప్రజా సమూహం రోజూ వస్తూ పోతున్నారు వచ్చిన వారందరూ సెట్లో డైరెక్టర్ శ్రీధర్ మూవ్‌మెంట్స్‌ను, వారు కనపర్చే శ్రద్ధాశక్తులను కళ్లారా చూసి నోటిమీద వేలేసుకుంటున్నారు. "టేకింగ్ సుపర్బ్" అంటూ పరిశ్రమతో సంబంధం వున్న వారొక ప్రక్క, "ఎంచక్కా చేయిస్తున్నాడండీ" అంటూ ఆంధ్రా నుంచి వచ్చిన జనావళి మరొకప్రక్క శ్రీధర్‌ను ప్రశంసించడం చూశాను కాబట్టే పై మాటలు వ్రాయగల్గుతున్నాను.

"పెళ్లి కానుక", "మనసే మందిరం" చిత్రాలు కాలం జరిగేకొద్దీ పాత చిత్రాలుగా పరిగ ణింపబడవచ్చునేమోగానీ, ఆ చిత్రాలను డైరెక్ట్ చేసిన శ్రీధర్ మాత్రం ఏ రోజు కారోజు దర్శ కత్వంలో నూతనత్వం సంతరించుకుంటున్నారని చెప్పడానికి బలమైన నిదర్శనంగా, బహు వేగంగా తయారవుతున్న చిత్రమే "సీత గీత దాటితే ." చిత్రం నాగరికత వెర్రితలలు వేస్తున్న ఈ నవీన యుగంలో స్త్రీ—పురుషుల మనస్తత్వాలు, మనుగడలు ఎలా విపరీతావస్థలోకి పెరుగిడుతున్నాయన్న సత్యానికి దర్పణం పట్టే విధంగా తయారవుతున్న చిత్రమే "సీత గీత దాటితే. " "శ్రీధర్ విల్ ఎవర్ లివ్ ఇన్ ది హార్ట్స్ ఆఫ్ పీపుల్" అన్న కొందరి నమ్మకాన్ని మరింత పటిష్ఠం చేసే విధంగా తయా రవుతున్న చిత్రమే సీత గీత దాటితే .."

### బిజీ బాపయ్య

దర్శకుల లిస్టులో "ఏ" రాంక్‌లో నిలబడగల సమర్థత వున్న కొద్దిమంది డైరెక్టర్స్‌లో బాపయ్య ఒకరనడానికి ఈకలం అభ్యంతరం చెప్పడంలేదు. లక్‌తో కాకుండా లక్ష్యంతో, సడన్‌గా కాకుండా, సాధనతో పేరు తెచ్చుకున్న దర్శకుల్లో బాపయ్య ఒకరంటే ఎవ్వరూ నిరాకరించరని ఈ రచయిత నమ్మకం,

ప్రస్తుతం బాపయ్య బలే బిజీగా వున్నారనడానికి ఈ క్రింది చిత్రాలే సాక్ష్యాలు. అక్టోబర్ 25 న ప్రారంభమైన ఉదయలక్ష్మీవారి "ఇంద్రధనుస్సు"కు బాపయ్యే దర్శకుడు. నవంబర్‌లో చరణ చిత్ర ప్రారంభించే "చరిత్ర హీనులు" చిత్రానికి బాపయ్యే నిర్దేశకుడు. హిందీలో నిర్మింపబడుతున్న "సోగ్గాడు" చిత్రానికి బాపయ్యే డైరెక్టర్ జనవరి ఆఖరుకు పై మూడు చిత్రాలు ఓ రూపానికి వస్తాయి ఫిబ్రవరి నుంచి శ్రీ రామకృష్ణా ఆర్ట్స్ (శోభన్ ద్విపాత్రాభినయం) నిర్మించే "గడుసు పిల్లోడు వర్ణచిత్ర రథానికి బాపయ్యే రథసారథి. ఏప్రిల్ నుంచి నటసామ్రాట్ అక్కినేనితో సురేష్ రామానాయుడు నిర్మించే రంగుల చిత్రానికి బాపయ్యే దర్శకుడు. త్వరలో మరో హిందీ చిత్రం వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. ఒక ప్రక్క "ఇంద్ర ధనుస్సు" షూటింగ్, మరొక ప్రక్క "చరిత్ర హీనులు" డిస్కషన్, వేరొక ప్రక్క హిందీ "సోగ్గాడు" పై చర్చ, ఇంకొక ప్రక్క "గడుసు పిల్లోడు" సిటింగ్ కార్యక్రమాల్లో విసుగులేకుండా పాల్గొంటూ, విరామానికి దూరంగా వుంటున్న బాపయ్యను బిజీ బాపయ్య అని సంబోధించడం అసమంజసమా !



'మంచికి స్థానం లేదు'లో ఉమ, శేషగిరాచారి



'విడని బంధం' లో

# జెమినీ టీ

## రుచికి రాజమకుటం ఈ టీ

ఇదుగో సిరులెన్నో ఉప్పొంగే జెమినీ టీ.
రాజదర్బారు యొక్క అనుభవం చవిచూస్తారు మీరు.
ఆ దర్జా రాసికి చెందిన చిక్కని టీ.
అందుకే మీకు మరిన్ని కప్పులనిస్తుంది.
ఇది మీరు ఉత్సవం జరుపుకునేలాంటి పొదుపు.
ఇంకనుంచి ఉత్సాహంతో ఉవ్విళ్ళూరండి, జెమినీటీతో.




**జెమినీ టీ టాటా-ఫిన్లే వారిది.**



'ప్రేమ లీల'లో కమల్‌హాసన్, జయచిత్ర

# సినిమా

### స్టీఆర్ సోబర్ అండ్ డేరింగ్

''సూపర్ స్టార్'' ఎన్టీఆర్ నటించిన మరొక ట్ చిత్రమే శ్రీ రామకృష్ణ చిత్రవారి ''మంచికి రో పేరు'' ఈ వర్ణచిత్రంలో ఎన్టీఆర్ సోబర్‌గా, ర్షుగా, డేరింగుగా నటించారు. నవరసభరితమైన ానాయకుడి పాత్రలో ఎన్టీఆర్ విశిష్టంగా నటిం ు. శృంగార, కరుణ, భీభత్స, హాస్యరసాలు ుపాళ్లలో వున్న ''మంచికి మరో పేరు'' చిత్రంలో ష్ణంరాజు, రామకృష్ణ, సత్యనారాయణ, ాభూషణం, ప్రభాకరరెడ్డి, జి. వరలక్ష్మి, ప్రభ, ప్రియ లాంటి ప్రముఖులు ప్రధాన పాత్రలను ించారు.

ఈ చిత్రానికి ఆరుద్ర వ్రాసిన సంభాషణలు ఎంత రమణీయంగా వున్నాయో, రాజేశ్వరరావు సమకూర్చిన బాణీలు అంత ఆనందాన్ని యిచ్చేవిగా వున్నాయి.

''ది గ్రేట్ ఇషన్ ఆర్ట్య'' గ్రేట్‌నెస్ ప్రతి ఫ్రేములో కనిపించి, ప్రేక్షకుల కరతాళధ్వనుల నందుకుంటుంది.

ఎస్. మనోహర్ నిర్మించిన యీ భారీ వర్ణ చిత్రానికి సి. ఎస్. రావ్ దర్శకుడు.

### కల్పన తరువాత సుధ

మంచి చిత్రాల నిర్మాత శ్రీ కాంతికుమార్ ''కల్పన'' చిత్రాన్ని పూర్తి చేశారు. డిశంబర్ 31 న విడుదల చెయ్యాలని ప్లాన్ చేశారు.

''కల్పన''గా జయచిత్ర నటించ, మురళీ మోహన్, గుమ్మడి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి ముఖ్య పాత్రలను పోషించారు. ''జ్యోతి'' ఫేమ్ (కె. ఆర్. ఆర్.) ''కల్పన'' చిత్రాన్ని అపురూపంగా తీర్చిదిద్దారు.

''కల్పన'' చిత్రాన్ని పూర్తి చేసిన కాంతికుమార్‌గారు ఏప్రిల్ నుంచి మరొక చిత్రాన్ని నిర్మించడానికి నిర్ణయించారు.

ఆ చిత్రంలో జయసుధ హీరోయిన్ పాత్రను పోషించగలదని, రాఘవేంద్రరావు అండ్ హిజ్ యూనిట్ పని చెయ్యగలదని, కాంతికుమార్ చెప్పారు.

### "మహా"లు పాల్గొనే మహోన్నత చిత్రం

జాతీయంగానే గాక, అంతర్జాతీయంగాకూడా పేరు ప్రఖ్యాతులు నార్జించిన ''శ్యాంబెనగల్'' గారిని రవిరాజ్ యింటర్నేషనల్ అధినేతలు కేశవ జయరామ్, వెంకట్రామిరెడ్డి తెలుగు చిత్ర దర్శకుడుగా ఎంపిక చెయ్యడంతో, ''మార్పు'' వస్తుందన్న నమ్మకం అందరికీ వుంది.

మనం అలవాటుపడ్డ చిత్రాలకు భిన్నంగా వుంటుంది ''బెనగల్'' గారి చిత్రం అన్నది అందరి అభిప్రాయం.

స్వయం ప్రతిభతో అగ్రనటి అయిన మన వాణిశ్రీని కొత్తరకం వేషంలో ప్రెజెంట్ చెయ్యబోతున్నారు, బెనగల్.

ఆమెతో నటిస్తున్నవాళ్లందరూ కొత్తవాళ్లు.

శ్రీ శ్యాంబెనగల్‌తో పని చేస్తున్న టెక్నికల్ యూనిట్ అద్వితీయ ప్రతిభావంతులుగా ప్రకాశిస్తున్నవాళ్లే. ఎవరవ: ''గిరీష్ కర్నాడ్, వనరాజ్ భాటియా, గోవింద్ నిహలాని, శ్రీశ్రీ'' గార్లు.

రవిరాజ్ యింటర్నేషనల్ తలపెట్టిన ''మ్యాక్రెండ్'' వర్ణ చిత్రం డిశంబర్ 15 న ప్రారంభమై, వరుసగా అరవై రోజులు ఆంధ్రప్రదేశ్ లోని అందమైన ప్రదేశాలలో పూర్తవుతుంది.

### బెనగల్‌కు సత్కారం

''పద్మశ్రీ'' శ్యాంబెనగల్‌గారికి మదరాసులో సత్కార సభ జరిగినప్పుడు, డాక్టర్ బి. ఎన్. రెడ్డి, డి. వి. ఎస్. రాజు, పి. పుల్లయ్య, ఎమ్. ఎస్. రెడ్డి, శ్రీశ్రీ, సీతారామారావు, త్రిలోక్‌చందర్ మరియు వాణిశ్రీగార్లు శ్యాంబెనగల్‌గారి ప్రతిభా విశేషాలను ప్రశంసిస్తూ, ఆయన చేపట్టిన కొత్త ప్రయత్నంలో విజయుడు అవ్వాలని ఆకాంక్షించారు.

నిర్మాతలు జయరామ్, వెంకట్రామిరెడ్డి గార్లను అభినందించి, వారికి జయము చేకూరాలని ఆశీర్వదించారు. ఒక మహాయజ్ఞాన్ని తలపెట్టిన రవిరాజ్ నిర్మాతలకు మన ప్రేక్షకుల ప్రేమాభిమానాలు తప్పక లభిస్తాయి. ఈ చిత్రానికి తారకరామ ... నవభారత్ ... శ్రీతారకరామ పంపిణీదారులు.

— శ్రీనివాస్



'అత్తవారిల్లు'లో సారథి, విజయ





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు పచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410 TG



# ఇది ఒక క్లాసిక్ కథ

## కృష్ణ. ఎం. ప్రసాద్

"బర్‌ర్‌ర్ ... బర్‌ర్‌ర్" అంటూ శబ్దంచేస్తూ ఆగిపోయింది కారు.

"వాట్ హాపెన్డ్ ? !"

"ఏమయిందోయ్ కారుకు..."

"ఇంజన్ ట్రబుల్ యిస్తున్నది సార్ !"

అది డ్రైవరు సమాధానం.

"ఓ మై గాడ్ ! ..."

"ఆరి ! భగవంతుడా..." లోపలివాళ్ల దీనాలాపాలు యివి.

డ్రైవరు కారు దిగి ఇంజనును పలకరించి చూశాడు. రెండు నిముషాలపాటు అవీ యివీ వైర్లు కదిలించాడు ఆడించాడు విదిలించాడు. బ్యాటరీని టెస్ట్ చేశాడు. మళ్లీ వచ్చి సీట్లో కూర్చుని ట్రై చేశాడు. మళ్లీ మళ్లీ ట్రై చేసి చూశాడు. ఉహూం ! ఏమీ లాభంలేకపోయింది.

"ఏమిటి సంగతి ?" అడిగారు యజమాని రాజుగారు.

"మీరు ఏం అనుకోకపోతే ఒక నిమిషంపాటు దిగి తొయ్యాలి సార్!" వినయంగా నసిగాడు డ్రైవరు జేమ్సు.

తప్పదన్నట్లుగా చూసి ఆముదం తాగిన మొహాలుపెట్టి క్రిందకు దిగారు – రాజుగారు, ఆయన బావమరదిగారు.

ఒకటీ ... రెండు ... మూడు ... పది గజాలు తోసేసరికి అలుపు వచ్చినట్లుంది వారికి, గట్టిగా నిట్టూరుస్తూ ఆగిపోయారు.

"అవునుమరి అసలే పెద్ద శరీరాలు, అందునా అలవాటులేని పని. పైగా ఇంకో రెండు భారీ శరీరాలు అంటే వారి సతీమణుల కాయములు యింకా కార్లోనే వున్నాయి. కష్టమేకదా !" మనస్సులోనే అనుకున్నాడు జేమ్సు.

"అమ్మా ! మీరుకూడా దిగితే..." మధ్యలోనే ఆపేశాడు.

సుఖంగా వెనక సీట్లో కూర్చున్నవారికి కారం రాసినట్లు బాధపడ్డారు. కాని తప్పదుగా, దిగారు.

మళ్లీ తోశారు. ఈసారి నలుగురు. పదండి ముందుకు ... పదండి తోసుకు ... కానీ ఏం లాభం లేకపోయింది. ఒకటి కాదు, రెండు కాదు ఐదారు నిముషాలపాటు తోసినా ఫలితం శూన్యం. మళ్లీ పడింది బ్రేక్.

"ఇందాక డిన్నర్లో తిన్నదంతా అరిగి వుంటుంది. ఇక చాల్లే ఈ బండీ తోపుడు పని..." అనుకున్నాడు జేమ్స్. కారు దిగి బయటకు వచ్చాడు.

"ఇక లాభంలేదు సార్ ! ఇంజన్ వర్క్ చేయనంటున్నది. ఇంకా యాభై మీటర్లు పైగా వుంది పెట్రోల్ బంక్. ఏం చేద్దాం ?" జేమ్స్ ప్రశ్న.

"అంత దూరం నేను తోయలేను. ఇక చాలు యీ సర్కస్ పని !" ఆయాసపడిపోతున్న రాజుగారి బావమరిదిగారి సమాధానం.

తనను ఎవరైనా ఎరిగున్నవారు చూస్తారేమోనని భయం భయంగా రోడ్డుమీదకు అటూ యిటూ చూశారు రాజుగారు. అయినా ఎవరు వస్తారులే ఇటుగా యింత రాత్రివేళ అన్న ధీమా వున్నా, మనస్సులో ఏదో మూల పీకుతూనే వుంది. ఇంకా యింటికి చేరాలంటే నాలుగైదు మైళ్ళు పోవాలి. అంత దూరం, అమ్మో, నడవ గలమా ?

రోడ్డుమీద అడపాదడపా ఆర్టీసీ బస్సులు, పెద్ద శబ్దంతో పోతూన్న లారీలూ, ఒకటీ అరా కార్లు పోతూనేవున్నాయి. ఒకరుకూడా తమ సంగతి పట్టించుకున్నవారు లేరు. లిఫ్ట్ కావాలా అని అడిగినవారు అసలే లేరు ... ఇడియట్సు.

* * *

జేమ్స్ టైం చూసుకున్నాడు. అలా టైం చూడడం యిది అతనికి ఏ పదోసారో టైం

పది గంటలు దాటింది. అంటే తాను అక్కడకు వచ్చి ఐదుగంటలు దాటిందన్నమాట.

అతను రాజ్ అండ్ రావ్ కంపెనీలో డ్రైవర్. రాజాగారు ఆ కంపెనీకి మేనేజింగ్ పార్ట్నరు. ముఖ్యమైన స్నేహితుడింట్లో ఫంక్షన్ ఏదో వుంటే సిటీకి ఇరవై మైళ్ళ దూరంలో వున్న ఆ ప్రాంతానికి వచ్చారు ఆయన.

జేమ్స్‌కు చాలా విసుగ్గా వుంది. అంతవరకూ అతన్ని పలకరించినవారు లేరు. తన లోపల ఆత్మారాముడు గోల చేస్తూంటే, పెద్ద తోటలో మధ్యలో రాజభవనంలా వున్న ఆ బిల్డింగ్ లోపల భోజనాలు ముగించినట్లున్నారు. హడావిడి తగ్గి, గోల అంతగా వినిపించటంలేదు. తనకోసం మేరి యింకా ఎదురుచూస్తూనే వుంటుంది, ఇంటివద్ద. కనీసం తనైనా మీల్సు చేసిందో లేదో. వెధవ ఉద్యోగం ఇది ఒక్కొక్కసారి అంతే. కానీ అప్పుడప్పుడు అనుకోకుండానే బక్షీస్ కింద ఐదూ పదీ దొరుకుతునేవుంటాయి. అందుచేతనే యిదివరలో యెన్ని ఉద్యోగాలు మారినా మూడేళ్ళుగా యీ కంపెనీలోనే వుంటున్నాడు ... యిలా సాగుతున్నాయి అతని ఆలోచనలు.

మరో అరగంటకుపైగా కాలం గడిచింది.

ఆ ఫ్రెండ్ దగ్గర సెలవు తీసుకొని రాజుగారు, ఆయన బావమరిదిగారు, వారి భార్యామణులు విందులోని వంటకాల గూర్చి మాట్లాడుకుంటూ స్వీట్స్‌ను తలంచుకొని కిళ్ళీ నములుతూ వచ్చి కార్లో సుఖాసీనులయ్యారు.

కారు బయలుదేరింది. అప్పుడు టైం పదకొండు గంటల పది నిముషాలైనట్లు రికార్డు చేసుకున్నాడు మనస్సులోనే జేమ్స్.

తనేమో ఆకలితో వుంటే వీరేమో పీకలదాకా మేసిందేకాక యింకా ఆ విందు గురించే మాట్లాడుకోవటం అతనికి చాలా బాధగా వుంది. అంతలోనే ఒక కొంటె ఆలోచన మనస్సులోకి తళుక్కున ప్రవేశించింది. అంతే...

* * *

"సార్! నేను పోయి బంక్ దగ్గర ఏదైనా టాక్సీగాని ఆటోగాని దొరుకుతుందేమో చూసిరానా." వినయంగా అడిగాడు డ్రైవర్.

"ఆఁ" నిద్రలోంచి పూర్తిగా మేల్కొనని వాడికిమల్లేనే వుంది ఆయన స్వరం. ఇప్పుడు టాక్సీలో ఇంటికి పోవాలా? దానికి పదిరూపాయల ఖర్చు. పైగా యీ కారును బంక్ దాకా తోయటానికి కూలీ, దీని రిపేరుకు మళ్ళీ ఎంతో? ఆయన మెదడు "కాలుక్లేటర్" లాగా ఖర్చును అంచనా వేయటానికి ప్రయత్నిస్తుంటే, మనస్సు ఆ ఖర్చుకు తెగ బాధపడిపోతున్నది. ఆడవాళ్ళిద్దరూ ఏమిటీ న్యూసెన్స్ అన్నట్లుగా చూస్తున్నారు. వారికి భుక్తాయాసంతోపాటు అలుపు బాధిస్తుంటే, చల్లగాలికి నిద్ర వచ్చేస్తోంది.

"అల్లాగే కారును బంక్ దాకా తోయటానికి యెవరైనా దొరుకుతారేమో కూడా చూడు. త్వరగా." అన్నాడు రాజాగారి బావమరిది ధైర్యంచేసి. ఆయనకుకూడ నిద్ర ముంచుకు వచ్చేస్తోంది.

ఐదు నిముషాల్లో తిరిగివచ్చాడు జేమ్స్ ఓ టాక్సీలో. అతనితోపాటు మరో ముగ్గురు వర్కర్లు కూడా వున్నారు.

"మనం అదృష్టవంతులం సార్! సమయానికి అక్కడే టాక్సీ వుంది. లేకపోతే..."

"సరి సరి. వాళ్ళకు ఎంతివ్వాలో ముందది చెప్పు." అతని మాటలను మధ్యలోనే అడ్డుకున్నారు ఆయన.

"ఫిఫ్టీన్‌రుపీస్. నేను రేపు మార్నింగ్ వచ్చి కారును రిపేరు చేయించి తీసుకువస్తాను మీరిప్పుడు టాక్సీలో వెళ్ళండి." అన్నాడు జేమ్స్.

"సర్లే" అంటూ రాజాగారు పర్సులోంచి రెండు పదిరూపాయల నోట్లు తీసి అతనికిచ్చి, "మిగిలింది నువ్వు తీసుకో. రేపు ఎనిమిదింటికే యింటికి రా. అప్పుడు చూద్దాం కారు సంగతి." అన్నారు.

"ఎస్సార్!"

టాక్సీ కదిలింది.

కారును బంకుకు చేర్పించి ఆ వర్కర్లకు తలో రెండురూపాయలు యిచ్చి పంపేశాడు జేమ్స్. తనను ఆకలితో అంతసేపు వుంచినందుకు అయ్యగారికి యిప్పటికే ముప్పైరూపాయలదాకా క్షవరం. ఇంకా రేపు మార్నింగ్ మరో ట్వెంటీ, ట్వెంటీఫైవ్ — నవ్వుకున్నాడు.

రోడ్డుమీద వీస్తున్న చల్లగాలికి అప్పటిదాకా వున్న విసుగు పారిపోయింది. గబగబ నడుస్తే అరగంటలో యింటికి చేరవచ్చు. పెట్రోల్ బంక్ పక్కనే వున్న టీ బంకులో నాలుగు సమోసాలు తిని కప్పు టీ తాగేసరికి హుషారు వచ్చింది అతడిలోకి. మెల్లగా నడక సాగించాడు, రేపు కారు రిపేరింగుకు యెంత బిల్ చెయ్యాలా అని ఆలోచిస్తూ.

అతని కడుపులోని ఆకలి చల్లారింది కొంతవరకూ.

అతని మనస్సులోని కసీ పోయింది చాలా వరకు.

# సామాన్యుని సణుగుడు

## ఎక్కడుంది లోపం?

మొన్ననే వో స్నేహితుడు మొదటిసారి కాబోలు మన "ఆంధ్రప్రదేశ్" వచ్చాక హైద్రాబాద్ వెళ్లి వచ్చాడు... గొప్ప చిట పట లాడిపోతున్నాడు. అంత పెద్ద ప్రపంచ సభలు జరిగాయి — ఐనా అక్కడ యింకా తెనుగు మాట్లాడేవాడు — రిక్షా ఎక్కడం కష్టం — ఆటో బేరమాడుకోడం కష్టం — సిటీబస్‌లో దుకాణాల్లో అన్నిచోట్లా యింకా "కచ్చా పచ్చా" వుర్దూ ముక్కలు వస్తేనే తప్ప గడవటంలేదు" అన్నాడు.

తెనుగోడి గోడు పాత అయిపోయిందేమోనే యిప్పుడు తెనుగు తల్లి తీయతీయని తేనెపల్కుల వరదలు మన భాగ్యనగరాన్ని మరింత సంపన్నం చేస్తున్నాయి అనుకున్నామే — మరి యీ "భాషా జులుం" యింకా మన రాజధానిలో తగ్గకపోట మేమిటని?

దేశంలో ఏ మూల ప్రాంతంవాడైనా, మరో మూల కొచ్చి రిక్షాలు, ఆటోలు, టాక్సీలు టీ దుకాణాలు అవీ నడుపుకోవచ్చును. కాని — దానికి ముల్కీలే వుండనక్కరలేదుగని — సహజంగా ఆ పరాయివాడు స్థానిక భాషని నేర్చుకోవాలి అంతేగాని — సొంత రాజధానిలో మరో భాషలో పని పాటలు చూసుకునే దుస్థితి తెనుగు భాషా వుద్యమాలు తెనుగు ప్రచారాలు, మహాసభలు జరిగాకా కూడా తప్పదూ అంటే... లోపం ఎక్కడో వుండి వుండాలె... అది తెనుగు భాషలోనా? తెనుగువాడిలోనా? అంటే తెనుగు భాషలో కాదూ, తెనుగువాడిలోనే అని — మనం చెప్పుకోవాలి.

"హైద్రాబాద్‌కి పోగానే "ఆంధ్ర రాజధానీ నగరం యిది నాది" అనిపించాలి తెలుగువాడికి. మలేషియాలో, మారిషస్‌లో, మైసూర్‌లో మరో ఏరియాలో ఎక్కడికెళ్లినా తెనుగు నాలిక చేసే తెనుగు శబ్దాలకు ఆదరణా విలువా వున్నాయి. "శ్రవణపేయమైన జీవద్భాష మనది అని భుజాలు పొంగిదీసుకుంటే ప్రయోజనం లేదం"ది పురో యిల్లాలు...

"తెనుగులో మాట్లాడండి. తల్లి భాష తెనుగును ఆదరింపుము" అని బోర్డులు ట్రాఫిక్ సిగ్నల్సు ప్రక్కనే వ్రేలాడదీస్తే ఎలా వుంటుంది? అన్నాను నేను. ఓహో! మాట్లాడండి మనం కాదు, అక్కడివాళ్ళు. పోలీసు కానిస్టేబుల్ కూడా "ఏమండీ" అంటే "క్యాహై" అన్నాడు ఆబిడ్స్‌లో అని మరో కంప్లెయింటు...

"సరే రేడియోలో చెప్పించాలి యిక లేదా తెనుగులో మాట్లాడుతాను అంటే తప్ప ఆటో రిక్షాలకి, టాక్సీ డ్రయివర్లకి వాటెని తోలే అవకాశం యివ్వగూడదు ..." అన్నాను.

"ఇది బెటరేగాని ఏదో పనిమీదో మట్టం మావుగా వెళ్ళేవాళ్ళలో తెనుగులో మాట్లాడి, ముక్కుపిండి అవకతవక రేట్‌లు యిచ్చుకోలేరుగాని — అక్కడ తెనుగులో దైనందిన జీవనం సాగాలీ అంటే అక్కడికిపోయి యిల్లూ వాకిలీ, పెళ్లాం పిల్లలూ అన్నీ చూసుకుని సెటిల్ అయిపోయిన "ఆంధ్రా బాబు"లే రోజా రిక్షా రేట్లు అవీ తెల్సినవారై వుంటారు కనుక — పనిగట్టుకుని తెనుగు మాటాడితే తప్ప — మన రాజధానీ నగరంలో తెనుగుతల్లికి కేవలం విగ్రహాలే మిగులుతాయికాని, మల్లెపూల మాలల గుబాళింపులు మాత్రం అందవు అని సణిగి సణిగి — నేను యింగ్లీష్‌లో కొంచెం విసుగు చూపించాకా వెళ్లాడు ... మా నేస్తం పాపం! అదీ విషయం.

[ వీరాజీ ]

## డాక్టర్ సలహాలు * —డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

ఏ. ఆర్. — నిడుబ్రోలు

నేను గత 2 సం.లుగా కాలికి "ఆనెల"తో బాధపడుచున్నాను. వీటిని పోగొట్టుటకు ఏమైనా మందు వున్నచో తెలుపప్రార్థన.

★ కాళ్ళలో ఆనెలు ఉండేవారికి తాత్కాలికంగా—నెప్పి తగ్గటానికి ఇంజక్షన్లు (ఆ ప్రదేశంలో స్పర్శజ్ఞానం కొంతసేపు లేకుండా చేసేవి); అనువైన పాదరక్షలు; కొన్ని పైపూత మందులు వాడటంగాని; — గాని; లేక నిరంతరంగా, జాగ్రత్తగా సమ్మూలంగా (త్రిభుజాకారంలోని వెడల్పు భాగం పైకి కనిపించేదిగాను, కోసుగాఉండుభాగం లోతుగా పాదంలోనుంచి తీసివేయటం, ఆచోట ఏర్పడే పుండుకి జాగ్రత్తగా తగినమందులతో కట్టు కట్టడంవలనగాని, చికిత్సచేయవచ్చును. ఈ రెండింటిలో రెండవది శ్రేష్ఠమైనది. సరిగాచేస్తే తిరిగి వచ్చే అవకాశంలేదుకూడా!

ఎస్. ఆర్. — హైదరాబాద్

నావయస్సు 23 సం.లు. నాకు 1 సం. నుండి 2, 3 నెలలకొకసారి గుండెనొప్పి వస్తున్నది. ఇప్పుడు 10 రోజుల కొకమారు నొప్పివస్తున్నది. నొప్పివచ్చినపుడు ఒక గంటసేపు వుంటుంది. దీనికి తగిన వైద్యము తెల్పండి.

★ మీరు వ్రాసిన "గుండెనెప్పి" అనేది కడుపులో ఏర్పడిన "హైపర్ ఆసిడిటీ" (అంటే ఆమ్లం ఎక్కువగా కడుపులో ఉత్పత్తి అవటం) వలన అయిఉంటుందని నా అభిప్రాయం. మీకు సందేహం, కోపం మొ.వి ఇప్పటికే ఏర్పడి ఉంటాయి గుండె నెప్పంటే కడుపులో ఏదో అంటాడేమిటని! కాని, శరీర నిర్మాణం తెలిసినవారికి, కడుపు (అన్నకోశం) పైభాగం చను మొనలుఉన్న ప్రదేశం వరకు ఛాతీలో ఉంటుందని అర్థమయ్యే ఉంటుంది. నిజానికి "కడుపు" అనబడే "అన్నకోశం" (స్టమక్) ఎక్కువభాగం ఛాతీలోని ఎముకలగూడు లోపలే ఉంటుంది. గ్యాస్ట్రైటిస్, కడుపులో పుండు (అల్సర్) మొ.వి. ఉన్నవారికి ఛాతీలో తరచు నెప్పి రావటం సహజం, ఎక్స్—రే తీసి ఛాతీలో ఏమీ లేదని నిర్ధారించుకొని ఈ అధిక ఆమ్ల ఉత్పత్తికి విరుగుడుగా "యాంటాసిడ్" మాత్రలు వాడండి. ఉదాహరణకు: ఆర్బిట్స్, జెలుసిల్ మొ.నవి. ఆహారంలో కారం పులుపుతగ్గించి, ఆహారాన్ని సకాలంలో కొద్ది కొద్దిగా పలుసార్లు తీసుకోవడంమంచిది.

వి. ఎమ్. — కాకినాడ

నాకు నాలుగు నెలల నుండి నోటిపూతగా వున్నది. కారం ఏమీ తినలేకుండా వున్నాను. నాకు వక్కపొడి అలవాటు వున్నది. నాకు ఆకలి బాగానే వుంటుంది.

★ నోటిలో తరచు "పూత" లేక "పుండ్లు" ఏర్పడటం ఆహారంలో విటమిన్ "బి కాంప్లెక్స్" తెగలోని "రిబోఫ్లేవిన్" (విటమిన్ బి—2) అనే దాని లోపంవల్లే అని ప్రస్తుతం అందరికీ తెలిసిన విషయం. ఆకలి బాగానే ఉన్నా తద్వారా "అన్నం" అనేది ఎక్కువ మోతాదులో తీసుకొంటున్నా "క్వాలిటీ" (విలువ లేక ప్రాధాన్య సత్తువలు గల పదార్థాలు లోపం) లేకపోతే ప్రయోజనం శూన్యం కదా! అందులోనూ బియ్యాన్ని రెండు, మూడు సార్లు "పాలిష్" చేయించి "మల్లెపూవు"లాగా అన్నం ఉడికించి తినటం ఒక అంతస్థు విలువగా మారిన ఈ రోజుల్లో, మళ్లీ దంపుడు బియ్యానికి మళ్ళేవారెందరు? అలా చేయలేని పక్షంలో నాగరికంగా "రిబోఫ్లేవిన్" 5 మి. గ్రా. మాత్రలు రోజుకు 3 వంతున నిరంతరం వాడండి. దీనితోబాటే కామంచి ఆకు రసం, కొబ్బరిపాలు, సగ్గుబియ్యం జావ మొ.వి వాడటం మంచిది. అన్నం ఉడికే సమయంలో గంజి వార్చినట్లయితే దాన్ని, నిమ్మరసం కలిపిగాని, మజ్జిగ కలిపిగాని త్రాగితే చాలా మంచిది.

వై. ఎన్. — సూళ్ళూరుపేట

నా భార్యకు 17 సం.లు. 3 నెలలుగా తల నొప్పి వస్తూవుండటమువల్ల డాక్టర్‌కి చూపించాము. వారు ముక్కులో "సైనొసైటిస్" అను వ్యాధి వున్నదని ఇంజక్షనులు, మందులు, ముక్కులో వేసే డ్రాప్సు వాడమన్నారు. ఇంతవరకూ ఏమీ గుణం కన్పించలేదు. మనిషి నీరసపడిపోవుచున్నది.

★ "సైనోసైటిస్" అనే వ్యాధి ముక్కు ప్రక్కన ఎముకల బోను.

నుదురు మధ్య భాగంలో ఉన్న ఎముకలో కండ్ల పై భాగంలోను ఉన్న గాలితో నిండిన ఖాళీ ప్రదేశాలలోని గోడలకి అంటుకొని ఉండే 'మ్యూకస్' పొర వాయటంవల్ల, ఏర్పడే నెప్పి మొదలయిన లక్షణాలని సూచించే రోగమే!

మందులకి లొంగనప్పుడు (వాటిని క్రమబద్ధంగా, నిర్ణీతకాలం వాడినతర్వాత గుణం కనబడకపోతే) ఇ. ఎన్. టి. వైద్యులకు చూపి చిన్న శస్త్ర చికిత్స వారు అవసరమంటే చేయించటం మంచిది. ఎప్పుడూ ఈ రోగాన్ని గురించి ఆలోచిస్తూ ఆహారం తినకపోవటంవల్ల నీరసం వచ్చి ఉంటుంది.

## డాక్టర్ వనిత

(22 వ పేజీ తరువాయి)

'నాకు ఒక్కటే బాధ. నిన్ను నా ప్రాణంలో ప్రాణంలా చూసుకున్నాను. చివరికి నువ్వు నా బద్ధశత్రువు నీడకి వెళ్లిపోతున్నావు.'

'శత్రువామ్మా ఆయన...' వనిత విస్మేష్టురాలైంది.

'అవును శత్రువే! నన్ను కాదని మరొకరితో సంసారంచేసి జీవితాన్ని వెళ్లబుచ్చిన వ్యక్తి నాకు అంతకంటే ఏమీ కాడు. వెళ్లు వెళ్లి హాయిగా వుండు.' అంది యామిని ఆమెకి దూరంగా జరిగి.

వనిత తన వస్తువులతో కొడుకుతో తండ్రిని చేరుకుంది. గోకుల్ జ్ఞాపకాలు ఆ యింట్లో ఆమెను కలవరపరచేవి. మొదటి రాత్రి గడిపిన ఆ గదుల్లో ఒక గది ఆమెకు అంపశయ్య మాదిరిగా అనిపించేది. అందరి సానుభూతి చూపుల్నీ తప్పించుకునేందుకు తండ్రి తప్ప వేరే ఆశ్రయం శ్రేయస్కరం కాదని రావుగారి దగ్గరికి వచ్చేసింది.

ఓడలు బళ్ళు అయాయి. బళ్ళు ఓడలు అయాయి. ఈ పదేళ్లకాలంలో తల్లీ తాతగారూ కాలగతిలో కలిసిపోయారు. మేనమామా అత్తగారూ కొడుకు దగ్గరికి వెళ్లిపోయారు. అంతటితో ఆ యింటికీ ఆమెకీ మధ్య సంబంధం తెగిపోయింది.

గోకుల్... ఏనాటి గోకుల్... అతని జ్ఞాపకం తరిమినట్లు నెహ్రూ తప్ప వేరే ఏమున్నదని అతన్ని తలుచుకునేందుకు. వనితకి దుఃఖం వస్తోంది. కోరికలు ఒక్కోసారి ఆమెను నిలదీసి ప్రశ్నించినట్లు భ్రమించేది. ఆమె డాక్టరుగా రోగుల సేవలో నిరంతరం మునిగి తేలినా అప్పుడప్పుడు నీడలాంటి వ్యక్తి ఎవరో తరిమిన అనుభూతి కలిగేది. ఆమె హృదయం స్పందించడం, అతని కోసం గాలించడం జరిగేది. ఆమె కట్టుబాట్లను తలుచుకుని భయవిహ్వల అయేది...

ఇప్పుడు... ఏమో? మారుతున్న సమాజంలో స్త్రీ ఆలంబన కోసం మరొకరిని వివాహం చేసుకోవడంలో ఆక్షేపణ లేదు. కానీ... వనిత తన ఆలోచనలకి కలవరపడింది. నెహ్రూ. ఈనాడు తల ఎత్తుకుని సగౌరవంగా తిరిగే పదేళ్ళ పిల్లవాడి భవిష్యత్... వనిత నిద్రలోకి జారిపోయింది. ఆమెను లేపేందుకు ఎవరూ రారు యిక అటువైపు.

ఆమె జీవితంలో దగాపడిన వ్యక్తి. ఆమెకోసం తండ్రి ఏమైనా చేయగల్గేందుకు సిద్ధంగా వున్నాడు. వీలైతే సమాజంలో కుళ్ళు పేరిట నిలబడే ప్రతినిధులకి మార్పియా యిచ్చేందుకు సైతం ఆయన తీవ్రంగా ఆలోచిస్తాడు. ఆమె నిద్రపోయిందని తెలిసి మనవడిని తన పక్కన పడుకోబెట్టుకున్నాడు.

* * *

స్కూల్ గ్రౌండ్‌లో సమావేశపరిచారు. అధికారులు చాలామంది వేదిక మీదకు వస్తున్నారు. వనిత ముందు వున్న సోఫాలో కూర్చుంది. పేరెంట్స్ అందరికీ ప్రత్యేకంగా సోఫాలు వేయించారు. స్కూల్ వార్షికోత్సవం కనుక ముందుగా కల్చరల్ ప్రోగ్రామ్స్ జరిగాయి. తదనంతరం వేదికమీదకి ప్రముఖులు ఆహ్వానింపబడ్డారు. కార్యదర్శి అందర్నీ పరిచయం చేస్తున్నాడు.

వనిత మనసూ శరీరమూ ఏకమై గాంధీకోసం తహతహలాడుతోంది. ఆమె కళ్లు చీకటినిసైతం ఛేదించేలాగ మారి అతని జాడకోసం వెదుకుతున్నాయి.

[ ఇంకా వుంది ]

పద్మశ్రీ నటరత్న యన్.టి. రామారావు సమర్పించు శ్రీరామకృష్ణ చిత్ర వారి

# మంచికి మరోపేరు






"ఏమండీ ఇవ్వాలేగామన బీరువా తెచ్చుకోవాలి. మీరు స్నానము కానిస్తే వెళ్దా"మంది-

"నువ్వెందుకు నేను బండి చేయించుకు తెస్తానుగా!" అన్నాడు విసుగ్గా-

"కాదండీ! నేనూ వస్తాను. రిక్షాలోవెళ్లి మళ్ళీ బండివెనకాతలే రిక్షాలో వద్దాం" అంది.

ఇక వివదనుకుని స్నానం ముగించాడు.

"గడ్డం గీసుకోకపోయారా!" విసుక్కుంది, టిఫిన్ కాఫీ యిచ్చింది. బట్టలు వేసుకొని సిగరెట్టు కాల్చుకుంటూ కూర్చున్నాడు. పిల్లలకి తామెళ్ళి బీరువా తెచ్చాక స్కూలు కెళ్ళుదురుగానీలే ... అంది. "లేటైపోతేనో?" అన్నారు వాళ్ళు-

"పోనీ ఈ పూటకు మానేద్దురు గానీ" అంది. వాళ్లకు చాలా సంతోషం కలిగింది. 'రోజుకో బీరువా వస్తే బావుండు. స్కూల్ కెళ్లకుండా హాయిగా ఇంట్లోనే ఆడుకోవచ్చు' అనుకున్నారు.

"ఏమండీ? వెళ్దామా!" అంటూ ఓ పెద్ద నిండుగా వున్న చేతి సంచితో వచ్చింది.

"ఏమిటది?" అడిగాడు.

"ఏం లేదండి. మా పుట్టింటివాళ్లిచ్చిన కంబళి. మన బీరువాకు బండిలో రాసుకుని గీతలు అవీ పడకుండ రంగు పోకుండా" అంది.

"నయం మన పెద్ద పరుపు తేకపోయావా, మరీ మెత్తగా వుంటుంది" అన్నాడు.

## ఉక్కు బీరువా

(18వ పేజీ తరువాయి)

"అవునండీ! తీసికెళ్దామా! రిక్షాలోనేగా వెళ్లేది."

"ఇక చాల్లే ఊరుకో. వాళ్ళు గడ్డీ అదీ వేసి జాగ్రత్తగా ప్యాక్ చేసి యిస్తారు. ఈ కంబళి ఇంట్లో తగలేయ్" అన్నాడు.

"ఉండనివ్వండి, మోసుకొచ్చేది నేనేగా. మీకేం పదండి" అంటూ "ఉండండి" అని, లోనికెళ్లి "ఒరేనానీ! ఒసే చంటీ! తలుపు ప్రక్కన ఈ హారతి పళ్లెం - కొబ్బరికాయ పెడుతున్నాను. జాగ్రత్తగా చూస్తుండండి" అని కదిలింది. బీరువా రాగానే హారతిచ్చి, కొబ్బరికాయ కొడదామని ముందుగానే సిద్ధం చేసుకుంది.

రిక్షాలో వెళ్తుంటే రిక్షా కంటే తన మనస్సు ఎప్పుడో బీరువా దగ్గర కెళ్ళింది. ఎన్నాళ్ల కెన్నాళ్ల కొస్తోంది, నా స్వంత బీరువా. నా బుజ్జిముండ. ఎంత బావుందో..

"ఇదిగో. ఇక దిగు వచ్చేశాం" అన్నాడు.

ఊహల్లోంచి బయటికొచ్చి రిక్షా దిగింది - కొంచం ప్రక్కగా ఓ బండి వుంది- ఇద్దరు దాన్దగ్గరికెళ్ళారు.

"ఇదుగో బండబ్బాయ్! బండ్లో ఉన్న గడ్డి సరిచేసి... ఈ కంబళీ పరుపు... ఆ ప్రక్క వీధిలోవున్న ఆఫీసునుంచి మా యింటి దాకా తీసుకురావాలి... బీరువా! ఏం పుచ్చుకుంటావు!"

"అలాగే తెస్తాను తల్లి! ఏమివ్వాలో మీకు తెలియదా – కష్టంచేసి, పొట్ట పోసుకునేవాళ్లం. మీ దయ"... అంటూ వాడు గడ్డి సరిచేసి కంబళి పరచి వాళ్లతో కదిలాడు.

రిక్షాను దానివెనకే రమ్మని నడిచి వెళ్ళారు.

ఆఫీసుదగ్గర కెళ్లేంగానే, జనమంతా గుంపులుగా వున్నారు.

ఓ! యిద్దరు పోలీసులు వున్నారు. గోవిందు ఏం జరిగిందాని అడిగాడు – ఓ నడివయస్సతను చెప్పాడు – ప్రక్కన అతని పడుచు పెళ్ళాంని చూపించి, "నన్ను సస్పెన్స్‌లో పెడదామని నాకు తెలీకుండా ఇదేమో వాయిదాల పద్ధతిలో బీరువా వస్తుందని డబ్బు తగలేసింది. నాకు తెలిసేసరికీ వాడో పెద్ద లోఫర్... తీర వచ్చేసరికి, ఉడాయించాడు – వాడిలాంటివెన్నో చేశాడు. మీరూ ఇందులో ఇరుక్కున్నారా?"అడిగాడు.

గోవిందు పెళ్ళాంవైపు చూశాడు కోపంతో – సుబ్బరత్నం ఆఫీసు తలుపుకేసి చూసింది, అక్కడో పెద్ద తాళంకప్ప సుబ్బరత్నాన్ని చూసి. "అయ్యో సుబ్బరత్నమా!" అంటూ జాలిగనూ, వికృతంగాను నవ్వింది.

# వారఫలం

మహేష్

**3-12-1976 శుక్రవారం మొదలు**
**9-12-1976 గురువారం వరకు**

**మేషం:—** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృషభం:—** వ్యతిరేకమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మిథునం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ [illegible]. అధిక వ్యయం జరుగుతుంది. వారం అఖరులో [illegible] వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం అఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

**సింహం —** మీ కార్యక్రమాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలలో లాభించ గలవు. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. అలంకార వస్తువులు కొంటారు.

**కన్య:—** వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మదు తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలు అను కూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం అఖరులో నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆందోళనకు గురికాగలరు.

**వృశ్చికం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. వారం అఖరులో [illegible] గురికాగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:—** మీ మంచితనమే మీకు ఇబ్బంది కలిగించగలదు. స్థిరాస్థి వ్యవహారాలు [illegible] మిత్రుల సహాయం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. అనవసరమైన [illegible] కలుగుతాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం:—** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. అనుకూలమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు విలాస వస్తువులు కొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం:—** ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ఉత్తరోత్తరా ఫలిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన సమాచారం అందుతుంది.

— మహేష్

# వంటలు

## చిమ్మిలి బూర్లు

కావలసిన వస్తువులు: నువ్వుపప్పు ½ కిలో మినప్పప్పు ¼ కిలో. బియ్యం ½ కిలో, పంచదార ½ కిలో, కొబ్బరిచెక్క, ఏలకులు కొన్ని.

బూర్లు చేసుకునే ముందురోజు మినప్పప్పు బియ్యం నానపోసుకొని ఈ రెంటిని కలిపి మెత్తగా రుబ్బుకుని ఒక గిన్నెలోకి తీసుకోవాలి. శుభ్రపరచిన నువ్వుపప్పును దోరగా వేయించి పొడుంగా కొట్టుకోవాలి. చక్కెర తీగపాకం తీసి ముందుగా కోరుకున్న కొబ్బరికోరు, యాలకుల పొడి వేసి బాగా కలియతిప్పుకోవాలి. ఇది చల్లారిన తర్వాత చిన్నచిన్న వుండలుగా చేసుకోవాలి. వీటిని తోపుతోచేర్చి బూరెలు చేసుకోవాలి.

— గుమ్మా యశోదాదేవి.

## వేరుశనగపప్పు చేగోడీలు

బియ్యప్పిండి-కిలో, వేరుశనగపప్పు-పావు కిలో, తగినంత మంచినూనె, మెత్తని ఉప్పు, కారం, వాము.

ముందురోజు రాత్రి నానబెట్టుకున్న వేరుశనగపప్పును మెత్తగా రుబ్బుకొని ఉంచుకోవాలి. జల్లించుకున్న బియ్యప్పిండిలో రుబ్బుకున్న ఈ వేరుశనగపప్పు ముద్దతో పాటు ఉప్పు, కారం, వాముపొడి వేసి కాచి చల్లార్చిన నీళ్ళతో గట్టిగా కలుపుకోవాలి. ఈ పిండిని తడిబట్టపై చేగోడీల ఆకారంలో చేసుకుని బాణలిలో కాగుతున్న నూనెలో దోరగా వేయించుకోవాలి.

— సీతా లక్ష్మీరాజ్.



## రాలిన ముత్యాలు

శ్రీ సోమసుందర్

తటాక తటాలపైకి ఒంగి
చుంబించే కమలముకుళాలు
కైవలినీ తరంగాల నావజూచే
రెల్లుపూల కనుసైగలు...

## సంసారంలో ఎలా మెలగాలి.

**ము**క్తి పొందడానికి చాలా అనుకూలమైనది సన్యాసమే. కాని, అది ఏ కొద్దిమందికో సాధ్యమవుతుంది. జనసామాన్యం సంసారంలో ఉండవలసినదే! అలా ఉంటున్నప్పటికీ తగినవిధంగా ప్రవర్తిస్తే ప్రయోజనం తప్పకుండా ఉంటుంది, 'ఆ తగినరీతి ఏది?!' అనేదానికి శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పిన సమాధానం ఇది–

"ఇంటిలోని పను లన్నీ చేసుకుంటూ ఉండవచ్చును. కాని మనస్సుమాత్రం భగవంతుని పైనే ఉంచవలసిఉంటుంది. గొప్పవారి యింట్లో పనిమనిషి అన్నిపనులూ శ్రద్ధగానే చేస్తుంది. కాని ఆమె మనస్సు మాత్రం తన యింటిమీదను ఇంటిలో విడిచివచ్చిన తన పిల్లల మీదనూ ఉంటుంది, యజమాని బిడ్డలను తన బిడ్డలమాదిరి! "మా బాబు, మా బాబు' అని బుజ్జగిస్తుంది. వీరెవ్వరూ తనవారు కారని ఆమెకు బాగా తెలుసును. ఇలాగు ఆ కుటుంబంతో ఎక్కువ సంబంధం కలుగజేసుకుంటూ నిర్లిప్తంగానే ఉంటుంది.

## ధర్మపథం —బులుసు వేంకటరమణయ్య.

మొసలి నీటియొడ్డున గట్టుపైనే గ్రుడ్లు పెడుతుంది. అది నీటిలో తిరుగాడుతూ ఉన్నా, దాని దృష్టిమాత్రం గట్టుమీద తాను పెట్టిన గుడ్లమీదనే ఉంటుంది. ఆ విధంగా సంసారంలో ఇతరకార్యాలు నిర్వహిస్తున్నా మనస్సును మాత్రం భగవంతుని మీదనే ఉంచాలి.

భగవంతునిపై భక్తి లేకుండా సంసారం చెయ్యబోతే బంధంలో పడిపోవడం తప్పదు. పనసతొనను ఒలువవలెనంటే చేతికి నూనె రాచుకొని మరీ ఒలువవలెను. లేకపోతే చేతికి జిగురు అంటుకొని, ఎంత వదలించుకొందామన్నా వదలదు. సంసారం సంగతికూడా అంతే. భగవచ్చింతన లేక అది వదలదు. భగవంతుని యందలి భక్తి అనే నూనె రాచుకొన్న తర్వాతనే సంసారంలోని పనిపాటులలో చెయ్యి పెట్టాలి.

ఆ భక్తి ఎలా కుదురుతుంది? అని అంటే దానికిన్నీ తగిన ప్రయత్నం కావాలి. దానికి ప్రశాంతంగా ఉండే నిర్జన ప్రదేశం కావలెను. వెన్నను తియ్యాలంటే పాలను తోడుపెట్టి ఒకచోట ఉంచాలి. మాటిమాటికీ దానిని కలియబెట్టితే పెరుగు తోడుకోదు. ఆ తర్వాత తక్కిన పనులను అన్నిటినీ విడిచిపెట్టి ఒకచోట కూర్చుండి పెరుగును చిలకవలెను. అప్పుడే వెన్న లభిస్తుంది.

ఏకాంత ప్రదేశంలో కూర్చుండి, భగవచ్చింతన చేసినప్పుడు ప్రశాంతంగా ఉండే మనస్సు ద్వారా భక్తి, జ్ఞానం, వైరాగ్యం లభిస్తాయి. ఆ మనస్సునే అనేకమైన కలతలతోకూడి ప్రశాంతి లేని సంసారవిషయాల్లో ప్రవేశపెడితే అది నీచంగా తయారవుతుంది కాని, ఉత్తమంగా ఉండలేక పోతుంది. సంసారం కేవలం స్వార్థపరత్వంతో కూడినదే: అందులో కామినీ, కాంచనాలను గురించిన ఆలోచనయే తప్ప మరొక ఆలోచన ఉండదు. అందువల్ల నిర్లిప్తంగా ఉండడానికి సర్వవిధాలా యత్నించాలి.



# వీధి కుళాయి

రంగధామ

"యస్తా? నిర్మస్తా?" అని రోజూ అడిగే ప్రశ్నే అడిగాను, అమరయ్యగారిని, చదరంగానికి కూర్చుంటూ.

సాయంకాలం ఆరుగంటలయ్యే సరికి మా అరుగుమీద కుర్చీలు వేసుకుని చదరంగం ఆడుకోవడం, నాకూ అమరయ్యగారికీ అలవాటయిపోయింది. ఆయన రోజూ ఇచ్చే జవాబే ఇచ్చారు. "మస్తు ఆటే ఆడదాం! నువ్వు ఆడే ఆ అంతర్జాతీయ సరళిలో నడిచే నిర్మిస్తు ఆట వట్టి అధర్మమోయ్!" అన్నారు నవ్వుతూ.

నా మనసులోని భావాలు పైకి వెలిబుచ్చలేదు కాని, ఇలా అధర్మం, అధర్మం అంటూనే, మన దేశం పరరాజుల వశమై అన్నాళ్లు బానిసత్వం అనుభవించింది, అని అనుకోకుండా వుండలేక పోయాను. మన భారతీయ పద్ధతిలో ఆడేఆట, శత్రువు యందు చాలా దాక్షిణ్యం ప్రదర్శిస్తుంది అసహాయుడైన రాజును చంపదు. వాడికి ఒక జంటుపు నిస్తుంది. ఆఖరుకి మిగిలిన జంతువును చంపదు. ఇది ఈ దేశస్థుల ధర్మబద్ధతను సూచిస్తుంది. కాని అంతర్జాతీయ క్రీడ అలా వుండదు చాలా నిర్దాక్షిణ్యంగా వుంటుంది.

ఇద్దరం వయసులో రెండు తరాలకు ప్రతినిధులం. నాది మూడు పదులు దాటని పరువం. ఆయనది అరవయ్యవ మైలురాయి దాటిన జీవిత వాహనం. ఇద్దరికీ చదరంగమంటే అతి మక్కువ. నేను ఆఫీసు నుంచి రావడమే తడవుగా. ఆయన్ని ఆటకు ఆహ్వానిస్తాను.

మేము ఆట మొదలెట్టేసరికి, మా వీధి కొళాయి వద్ద చిన్న కురుక్షేత్రం అయిపోయి నీళ్లు రావడం బందవడంతో ప్రశాంతత అలుముకుంటుంది. కానీ ఆనాడు నీళ్లు రావడం ఆలస్యమైంది కాబోలు, పోట్లాట ఒకే ఎత్తున తారస్థాయిలో అందుకుంది.

"ఏందబ్బయ్యా! ఏందిది? ఇయ్యాళ వచ్చుద్దో రాదోనని అంటని గదానని, ఆవంచన నా బింటె తీసేద్దామను కుంటున్నా. ఇంతట్లో వచ్చే! నే బింద తీనే లేదాయె, నీదెట్టా పెస్తావు? అని ఒక పల్నాటి పడుచు ఒక కుర్రాణ్ని ప్రశ్నిస్తోంది, వీధి కొళాయి వద్ద.

"జర్రా వుండమ్మా! నాకీయాళకే, దేర యింది! జల్ది నింపుక పోతాను." అని ఒక తెలంగాణా ఆడమనిషి బతిమాలోంది.

"నే నెప్పటి నుంచో కాచుక్కుచున్నానమ్మోయ్. నా వంతు అవందే నీకు ఇయ్యను ఫో!" అంటున్నాడొక కృష్ణాజిల్లా యువకుడు.

"అసలే ఆలస్యంగా వచ్చిందా;" నాదాకా వస్తుందో రాదో" అని ఒక మర్యాదస్తుడు వాపోతున్నాడు

మా యింటి ముందరే వీధి కుళాయి వుండటంవలన, అక్కడ జరిగే వాద ప్రతివాదాలూ, అరుపులూ, కేకలూ, ప్రొద్దున్నా, సాయంకాలం మాకు బహు చిరాకు కల్గి

స్తాయి. అనేకమంది స్వంత ఇళ్ళల్లో మంచి నీటి కొళాయి లేనివాళ్ళకు అది ఆధారం. పూరిగుడిసెల్లో నివసించేవారికి వాడుకుందికి కూడా నీళ్ళు సప్లై ఈ కొళాయి వలననే కావాలి.

అయితే, ఈ గొడవ ఎందుకు, హాయిగా ఒకరి తరువాత ఒకరు నీళ్ళు పట్టుకుని తమ యిళ్ళకు మోసుకు వెళ్ళవచ్చు గదా అని లని అనిపిస్తుంది గాని, అది జరిగిననాడు, మన దేశం, అభివృద్ధి చెందుతున్న దేశాల కోవ లోంచి, అభివృద్ధి చెందిన దేశాల 'లిస్టు'లోకి వెళ్ళిపోతుంది, అని కూడా అనుకోవచ్చు.

"ఇదంతా జనాభా పెరుగుదల మహాత్యమోయ్" అంటారు అమరయ్యగారు, ఎత్తు వేస్తూనే.

"అవుననుకోండి. కానీ ఇప్పుడైనా మించి పోయిందేముంది, మళ్ళీ మరొక పట్టణ నీటి సరఫరా ప్రణాళిక తలపెట్టి..." అని నేను వాక్యం పూర్తి చెయ్యకుండా, ఆటలో మునిగి పోయాను.

నీటి కొళాయిలు, వెనుక భూమికి మూడడుగుల ఎత్తులో వుండేవి. అవి క్రమంగా, భూమి మట్టానికి వచ్చి, భూమికి అడుగు లోతుకి వెళ్ళాయి మా వీధిలో. దీనికి కారణం, ఈ గుంటూరు మహా పట్టణంలో మొదట నీటి సరఫరా తలపెట్టినప్పుడు జనం తక్కువట. ఇప్పుడు అంతకు రెండింత లయింది కాబట్టి నీరు జనానికి అందటం లేదు.

ఇప్పుడు మా యింటిముందున్న వీధి కొళాయి, భూమికి, తొమ్మిదంగుళాల లోతున వుంది. దానికొక రబ్బరు గొట్టం తొడిగి, భూమిపైన వున్న తమ బిందెలలోకి తెచ్చు కుంటారు. ఆ నీళ్ళు పట్టుకునేవాళ్ళు. ప్రక్కనే మురుక్కాలువ ప్రవహిస్తూంది. వాళ్ళ బాధ చూస్తే జాలి కలుగుతుంది. చింతో ముందుగా, తమ బిందెల్ని వరుసగా పెట్టి, గంటలకొద్దీ పడిగాపులు పడి, ఆ నీరు రాగానే, ఒకరితో ఒకరు పోట్లాడు కుంటూ, వీలైనన్ని బిందెలు నింపుకు పట్టు కెళ్ళాలని చూస్తారు.

ప్రొద్దున్న పిల్లలు చదువుకునే సమ యంలో, కొళాయివద్ద పెద్ద పెద్ద కేకలు విన్పిస్తూంటాయి. కాలేజీలో చదువుకుంటున్న ప్రక్కింటి రాము, "అబ్బబ్బబ్బ! ఏమిటీ గొడవ?" అని విసుక్కుంటూంటాడు.

# వీధి కుళాయి

నేను ప్రొద్దున్న మొహం కడుక్కుం టూ వుప్పుడు, వీధి కొళాయివద్ద కలకలం ప్రారంభ మౌతుంది. అప్పటికింకా నీళ్ళు రావుగాని, బిందెలు చేరుతాయి. ఒకరిద్దరు ఆ ప్రాంతంలో తచ్చాడుతుంటారు. ఎదు రింటి హనుమాన్లుగారు, కనకయ్యని ప్రశ్నలు వేస్తుంటారు.

"ఏమోయ్! బజార్లోకి మామిడికాయ లొస్తున్నాయా?"

"ఆయ! వస్తున్నాయండి"

"ఏమిటి? అప్పుడే?"

"ఆయ! మరేనండీ. అప్పడే ఏటండీ సంవత్సరాది ఇంక రేండువారాలే కదండీ!' అంటాడు తూ. గో. జీ (తూర్పుగోదావరి జిల్లా) కనకయ్య. అతనికి మాట మాటకీ 'ఆయ!' అనడం అలవాటు. ఏదో మిల్లులో వాచ్‌మెన్‌గా పని చేస్తున్నాడు.

> ఒక మినీ యింటర్‌వ్యూ కుర్రవాణ్ణి నువ్వేమవుదామనుకుంటున్నావ్? అంటే జర్నలిస్టు నౌదామనుకుంటున్నాను అన్నాడు "ఎందుకు? అందులో విశేషం ఏమిటీ?' అంటే "ఏముందీ? నాకు తాగటం సర్దా; జర్నలిస్టునైతే ఆ సర్దా తీరుతుంది డిగ్నిఫైడుగా కూడా వుంటుంది" అని అన్నాడు.

కిటికీ దగ్గర నిలబడి గడ్డం చేసుకుం టున్న నా కళ్ళు వాటి పని అవి చేస్తుం టాయి అంటే వీధి కొళాయి దగ్గరకి వచ్చే భామల్ని పరిశీలిస్తూనూ వుంటాయి. వెనక నుంచి మా శ్రీమతి రాకనీ కనిపెడూ టాయి. పెళ్లానికి తెలిసి పరాయి ఆడదాని వైపు చూడకూడదని ఒక నియమం వుంది కాబట్టి, ఎందుకంటే భార్యని ప్రభుత్వంతో పోలిస్తే పరాయి ఆడదాని అందం పరిశీలించ డం, నల్లధనం మీద మక్కువతో పోల్చవచ్చు.

"ఏటి కనకయ్య మావా, కొళాయింకా రాలేదా?" అంటూ వస్తుంది ఒక పాతికేళ్ళ పడుచు. ఆ మనిషికే గనుక 'స్క్రీన్ టెస్టు' ఇస్తే రెండు పిక్చర్లతో 'బీజీస్టార'యిపోదూ, అనిపిస్తుంది. ప్రస్తుతం ఒక చిన్నపాకలో, ఒక రిక్షావాలా ఇలాకాలో వుంటోంది.

ఆ మనిషి వున్న కాస్సేపూ. కొళాయి కల కల లాడుతుంది.

"ఎంతసేపు ఆ గడ్డం గీసుకోవడం? స్నానానికి నీళ్ళు తోడాన" అని వెనక నుంచి శ్రీమతి పిలుపు విని గబగబ మొహం కడిగేసు కుని బాత్‌రూములోకి వెళ్లిపోతూంటాను.

అలా ప్రారంభమైన ప్రభాతం తొమ్మిది గంటలకు కొళాయి నీళ్ళు ఆగిపోవటంతో కాస్త సద్దుమణిగేది. మళ్ళీ సాయంకాలం మా ఆట సమయానికి మొదలు

ఆయనతో ఆ 'మస్తు' ఆడుతున్నంత సేపూ. నా మనసు హిందూదేశ చరిత్ర యొక్క గతంలోనే మెదుల్తుంది.

"అహింసా పరమోధర్మః" అని బోధిం చింది దేశ సంస్కృతి. అణుబాంబు ప్రయో గమే మా ప్రగతి అని చాటుతోంది నేటి పాశ్చాత్య దేశ రాజనీతి అవకాశమిస్తే, తోటి వారి తల దన్నగలమని దేశంలో సాంకేతిక నిపుణులు స్వాతంత్ర్యం వచ్చాక నిరూపిం చారు కాని ఈ సమాజం పురోగమిస్తోందా? అన్నది ప్రశ్నగానే ఎందుకు మిగిలింది!

వీధి కొళాయివద్ద జనం పల్చగావున్నారు. ఒక బ్రాహ్మణ వితంతువు తడిగుడ్డలతో, నీళ్ళు పట్టుకుని, నిండిన బిందెతో వెళ్ళి పోతోంది. ఆవిడ వెళ్ళిం తరువాత, ఇద్దరు ఏవో ఆచారాలమీద విసుర్లు విసురుతున్నారు. ఒకావిడ "అవధాన్లుగారి అబ్బాయి హరిజనుల పిల్లను పెళ్లి చేసుకున్నాడట!" అంది నీళ్ళు పట్టుకుంటూ.

దానికి ఒక నడివయస్కుడైన యువకుడు "ఈ మడులూ తడులూ ఏంటండీ? ఈ కాలపు కుర్రాళ్ళకివి నచ్చక, మరో కులం పిల్లను చేసుకుంటారు" అన్నాడు.

"లోకం అంతటికీ సూర్యోదయం అయింది గాని, అవధానిగారి వంటింట్లో మాత్రం సూర్యోదయం కాలేదు" అని ఒకా విడ విసురు విసిరింది. తక్కినవాళ్ళు నవ్వారు.

క్రమంగా వాళ్ళూ వెళ్ళిపోయారు. మా ఆట నెమ్మదిగా సాగింది. నా మనసులో మాత్రం సామాన్య ప్రజ లనుకునే వాళ్ళు కూడా ఎంత సునిశితంగా ఆలోచిస్తారు? అని ఆశ్చర్యం కలిగింది. ఒక ప్రక్కన విద్యా, విజ్ఞానం విస్తరిస్తున్నా, మరొక ప్రక్క సంఘంలో ఎన్ని అనర్థాలు!

రోజూ, వీధికొళాయివద్ద జరిగే వాగ్వాదా లతోపాటు, అప్పుడప్పుడు వినిపించే సంఘ విమ

# వీ ధి కు ళా యి

ర్భులు నా ఆలోచనను పెంపొందిస్తూండాలి నా దొక సామాన్య జీవితం! ఇందులో విశిష్టత ఏమీలేదు. నేనుగాని, నా తాతముత్తాతలుగాని ఏమీ గొప్ప పనులు చెయ్యలేదు. నేను కనీసం అవధాన్లుగారి అబ్బాయిలా, కులాంతర వివాహం చేసుకోలేదు. మా వీధిలో చాలా మంది చాలా పనులు, పేపర్లో పేరువచ్చియ్యే పనులు చేశారు. నేను మాత్రం అలాంటిది ఏమీ చెయ్యలేదు. నా పెళ్ళికి మా నాన్నగారు పదివేలు కట్నం వసూలు చేశారు. మా ఆవిడ కాస్త నల్లగావున్నా, నేనేం బాధపడలేదు. పెద్ద పెద్ద భవంతుల్ని, పూరి గుడిసెలో వాళ్ళు చూసి ఆనందించినట్లు, అందంగా వున్న అమ్మాయిల్ని, దూరంనుంచి చూసి ఆనందించేవాణ్ణి.

మా నాన్న చనిపోయి రెండేళ్ళయింది. అప్పటి నుండి నాలో, ఆలోచనలు విజృంభించాయి. అంతకు ముందు, పగటి కలలు కనడం, నా కొక 'హాబీ' గా వుండేది. కానీ ఇప్పుడు అది పట్టి తెలివితక్కువ అనిపిస్తుంది. ఏదైనా చిన్న ఘనకార్యం చేద్దామనిపిస్తూంటుంది. మా నాన్న బ్రతికున్నంతకాలం, గట్టిగా పదిరూపాయల నోటు ఒక్కసారి ఖర్చుపెట్టడానికి భయంగా వుండేది. ఆయన చనిపోయాక, బాంకులో నానుతున్న డబ్బును, చెరవిడిపించి, ఏదైనా చేద్దామనిపిస్తోంది.

కానీ అలా చెయ్యలేనని నాకు తెలుసు. దానికి చాలా తెగింపు కావాలి. నాన్న చనిపోయినా ఆయన ప్రభావం నామీద ఇంకా పోలేదు. మా వీధికొళాయి రోజు రోజుకీ అధ్వాన్నంగా తయారవుతూంటే నాకు మంచి ఆలోచన వచ్చింది. దాన్ని నేను ఎందుకు బాగుచేయించకూడదూ? దానిచుట్టూ గొయ్యి తవ్వించి సిమెంటు చేయించి మెట్లు పెట్టించి అందరూ శుభ్రమైన నీళ్ళు పట్టుకునే లాగ ఎందుకు చెయ్యకూడదు? కనీసం నలుగురూ ఫలానా రంగనాథంగారు వీధి కొళాయి బాగు చేయించారు అని చెప్పుకుంటారు.

నేను కనే పగటికలలో నేను అనేక ధర్మ కార్యాలు చేస్తున్నట్టు కలలుకంటూ ఉంటాను. కనీసం ఈ పనైనా పగటికలలా కాకుండా యదార్థమైతే బాగుండుననుకోసాగాను.

ఎదురింటి హనుమాను గారు కనకయ్యతో "ఈ కొళాయి ఒక 'న్యూసెన్సు' అయిపోయిందోయ్. దీనిని మునిసిపల్ వారితో చెప్పి కట్టించాలి." అంటున్నారు ప్రొద్దున్నే.

"అయ! ఏటయిందండి. మళ్ళీ నీళ్ళు పార్లిపోతున్నాయండి?" అని కనకయ్య ప్రశ్నించాడు.

"అవునోయ్! ఆ రబ్బరు గొట్టం ఊడిపోయుంటుంది."

"అయ!" అన్నాడు కనకయ్య దిగులుగా.

ఈ సంభాషణ విన్న కొద్ది రోజులకే హనుమాన్లుగారు ఈ కొళాయి వెంట నీరు పార్లి వీధంతా బురదవుతోంది. అని మునిసిపల్ వారికి ఫిర్యాదు చేశారని తెలిసింది.

ఒకవేళ మునిసిపల్ సిబ్బందే నే చెయ్యా లనుకున్న పని చేస్తుందేమోనని ఆశించాను.

అటువంటి సూచనలేమీ కన్పించలేదు.

"పోనీ మన వీధిలోని వాళ్ళుంతా చందా లేసుకుని బాగుచేయిస్తే?" అని హనుమాను గారిని ప్రశ్నించాను.

"అబ్బే లాభంలేదండీ. దానికి మునిసిపాలిటీవారి 'పర్మిషన్' కావాలి. చాలా మంది చుట్టూ తిరగాలి. ఈ బాధలు మనం పడలేము" అని హనుమాన్లుగారు నా సూచన కొట్టిపారేశారు.

ఆయన అలా తోసిపారెయ్యడంతో నాకూ అది సుసాధ్యంలా కనిపించలేదు. గాని మనసులో మండిపోయింది ఇలా ప్రతి మంచి ప్రయత్నానికీ, 'అబ్బే! లాభం లేదండీ' అనే వారి వలననే, సమాజం పురోగమించటం లేదనిపించింది.

అలాగే మరికొన్నాళ్ళు గడిచాక, ఒకరోజు ప్రొద్దున్నే మునిసిపాలిటీవారి 'మెకానిక్కు' కాబోలు వచ్చి ఆ కొళాయి వచ్చే గొట్టానికి మూత బిగించి వెళ్ళిపోయాడు. ఇక ఆ గొట్టం నుంచి నీళ్ళు రావు. మా యింటి ముందు గోల తగ్గిపోయింది.

నాలుగయిదు రోజులు అలా, యింటి ముందు నిశ్శబ్దం తాండవించేసరికి, నాకు బలే చిరాకేసింది. ఇక్కడ నీళ్ళు పట్టుకునే వాళ్ళంతా ఏమయ్యారు? వాళ్ళంతా ఎక్కడికి పోతున్నారు? ఎంతదూరం పోతున్నారో ఏమో!

అమరయ్యగారిని కదిపాను, "ఏవండీ

---

# యు వ త రం

మద్రాసు విశ్వవిద్యాలయం ఎం.ఎ. పరీక్షల్లో ప్రథమురాలిగా ఉత్తీర్ణురాలై బొబ్బిలి మహారాజావారి స్వర్ణపతకాన్ని అందుకొన్న కుమారి నిడమోలు జయశ్రీ ఎం. ఎ. లోనే ఇంకా రంగయ్యచెట్టి ప్రైజ్, జవహర్‌లాల్



నెహ్రూ మెమోరియల్ ఫండ్ అవార్డు లాంటి పతకాలను పొందడమే కాక అది వరకు బి. ఎ. లో కూడా స్వర్ణ పతకం పొందిన తెలివైన విద్యార్థిని.

"కథలు చదవడం, వ్రాయడం నా హాబీలు. చెన్నపురి ఆంధ్ర విద్యార్థి సమితి వారు నిగ్రహించిన వ్యాసరచన, కథానికల పోటీల్లో ప్రథమ బహుమతులను, నటుడు శోభన్‌బాబు ద్వారా అందుకున్నాను" అని చెప్పింది. "రాజకీయాల్లో తనకేమాత్రం ప్రవేశం లేదుట" ఐతే వోటింగ్ అర్హతను యిప్పుడే సంపాదించుకున్న ఈ అమ్మాయి శ్రీమతి ఇందిరాగాంధీ అంటే ఎంతో యిష్టమన్నది. పేపరు చదివినా, అందులో కూడా ముందు 'ఎద్యుకేషనల్ కాలమే' చదువుతుంది తర్వాతే ఏదయినా. "సినిమాలు చూట్టంమీద సరదాలేదు. ఫ్రెండ్సు బలవంతం చేస్తే వెళ్తాను. నాకు నచ్చిన సినిమా జ్యోతి" అంది. తరచు లైబ్రరీలకు వెళ్ళి "సబ్జక్టు" మీది పుస్తకాలు చదివే అలవాటుంది. కాలక్షేపానికి నవలలు చదవడం, చదరంగం ఆడటం చేస్తూంటుంది. ధరలు పెరగటానికి కారణం వ్యాపారస్తులు వారితో పాటు కొందరు ప్రజలు అని నమ్ముతున్న జయశ్రీ ప్రస్తుతం "ఎం. ఫిల్." చేస్తున్నది. సో... ఆ తరువాత లెక్చరర్ అవుతుందన్న మాట. —సు.

# చక్కని అభిరుచిగలవారికి నిజమైన పొదుపు

## రికరి
ఇన్‌స్టెంట్




## టీ స్పూన్‌లో సగంపొడి మాత్రమే వాడండి

(అభిరుచిని అనుసరించి ఎక్కువ తక్కువ చేసుకోండి)




**50 గ్రాముల సీసాకు**
**37 కప్పుల కాఫీ**

మరే యితర 50 గ్రాముల సీసా ఇచ్చేదానికన్నా 7 కప్పుల కాఫీని ఎక్కువ ఇస్తుంది రికరి. కారణం — రికరి చిక్కదనం. అంతేకాదు: పొదుపు చేసేమార్గం కూడా.



**మరింత చిక్కదనం.**
**మరింత పరిమళం**

ఎక్కువ రుచి. ఘుమాళింపు ఉండేటట్టుగా తయారీ. కనుక మంచి చిక్కని, రుచికరమైన కాఫీ ఒక కప్పు కావాలంటే, తక్కువ రికోరీ వాడితే చాలు.



ఇప్పుడు మీ రికరీ ధర చాలా తక్కువ!

50 గ్రాముల సీసా ధర 50 పైసలు తగ్గించబడింది — నిజం.

## రికరి
ఇన్‌స్టెంట్

## దాదాపు డికాక్షన్ కాఫీ ధరకు డికాక్షన్ కాఫీ రుచినిస్తుంది

NRCM-27 75 TEL

నలుగురికి పనికొచ్చే వీధికొళాయి మూత పడింది కదా వీధిలో ఎవరికీ చీమ కుట్టినట్లు యినా లేదేం.'' అన్నాను ఆయనతో.

''ఆ! పోనిస్తూ గోల తగ్గింది అదే చాలు.'' అన్నారాయన.

''అయ్యో! అది ఆకలిగోల, దారిద్ర్యపు గోల, అది అంత సులభంగా తగ్గదు. ఆ గోల తగ్గాలంటే అందరికీ అన్నం, నీళ్ళూ ఇల్లూ వాకిలి అమరాలి. మనింటి ముందు తగ్గిం దనుకుంటే చాలదు. మన వూళ్ళో నే తగ్గాలి మన దేశంలో తగ్గాలి...''

ఆయన పెద్దగా నవ్వారు. ''భేష్! ఉపన్యాసం బాగుంది కాని నీ మంత్రికి కాపు లేదు చూస్కో'' అన్నారు.

నా దృష్టి ఆట మీదకి మళ్ళింది. అమరయ్యగారిలో సంస్కారం లేదు అను కున్నాను మనసులో.

మా యింటి ముందు వీధి కొళాయి బాగుచేయించాలన్న నా కోరికకు మరికొద్ది రోజుల తరువాత పూర్తిగా సమాధి కట్ట బడింది. ఎందుకంటే ఆ కొళాయి వున్న గొయ్యి మట్టితో పూడ్చబడింది.

రోజులు మామూలుగా గడుస్తున్నాయి. మాచదరంగం ఆట కొన్నాళ్ళ మామూలుగానే సాగింది. తరువాత అమరయ్యగారి అనారోగ్య కారణంగా ఆగిపోయింది.

# వీధి కుళాయి

వీధిముందు మునుపు వినుక్కున్న గోల లేకపోవడం నాకెందుకో విచారం కల్పించింది. 'ఎవరూ పట్టించుకోరేం?' అని బాధ కలి గింది. ఈ స్తబ్దతా, ఈ నిశ్చేష్టతా పోవాలి అని పగటి కలలు కంటూండే వాడిని.

నా చదరంగానికి మరో మిత్రుడు దొరి కాడు. అతను హనుమాన్లుగారి తమ్ముడు భావన్నారాయణ. అతనికి చదరంగంలో మహ ఆసక్తి. అతన్ని ఒకనాడు ఆటకి పిల్చాను

''నిర్మస్తా? మస్తా?'' అని అతను నన్నడిగాడు.

''నీ యిష్టం'' అన్నాను.

''ఇంటర్నేషనల్ గేమ్'' ఆడదాం సార్. ఆ మస్తాట వట్టి జిడ్డు ఆట సార్'' అన్నాడు.

నాలో నేను నవ్వుకున్నాను. పాశ్చాత్యుల దగ్గరనుంచి నేర్చుకోవలసినవి ఎన్నోఉన్నాయి. అందులో ఈ ఆటలో ఈ పద్ధతి ఒకటి.

మళ్ళీ మామూలుగా రోజూ మా చద రంగం ఆట సాగిపోయింది. కాని ఈ ఆటలో నా పుత్సాహం అంతగా పెరగలేదు. మరీ టపీటపీమని జంతువుల్ని చంపేసుకోవడం ఎక్కువ.

అయినా కాలాన్ని వృధా చెయ్యటానికింకో మార్గం దొరకలేదు పగటి కలలు కంటూం డడం చదరంగం ఆడటం ఇవే నా 'హాబీలు' అయ్యాయి.

వీధిలో కొళాయి లేకపోవడంవల్ల గోల ఎక్కువవలేదు. కాని ఆ ప్రదేశం చూసి నప్పు డల్లా ఏదో తప్పుచేసినవాడిలా బాధపడేవాణ్ణి.

వర్షాకాలం వచ్చింది. రోడ్ల మోకాలి లోతు నీళ్ళలో మునిగాయి మా ఆరేళ్ళబుజ్జి గాడు పక్కింటి ఆరేళ్ళ పాపాయితో కలిసి కాగితం పడవలుచేసి ఆ నీళ్ళమీద వదలి చప్పట్లు కొట్టి సంతోషిస్తున్నారు.

ఈ ఋతువు మార్పులు సృష్టించిన భగ వంతుడికి జోహారు అర్పించుకున్నాను: జీవి తంలో మార్పులలా యీ ఋతువుల మార్పు ఎంతో చైతన్యం తీసుకొస్తాయి, మనిషి జీవితంలో.

వర్షాలు కొంచెం తగ్గగానే ఒకనాడు నేను ఆఫీసునుంచి తిరిగివచ్చి గుమ్మంలో అడుగు పెడ్తుంటే ఒక అపూర్వమైన దృశ్యం మా యింటిముందు కన్పించింది.

మా బుజ్జిగాడు, పక్కింటి పాపాయి సహా యంతో ఒక అడుగు ఎత్తుగల చిన్న పూల చెట్టును భూమిలో పాతుతున్నాడు. వాడి పరి శ్రమ చూస్తూంటే నా కాశ్చర్యం వేసింది. అట్టకాడతో మట్టి తవ్వి ఎత్తుతున్నాడు. పాపాయి ఆ మట్టి అవతల పారవేస్తోంది. ఇద్దరి మొఖాలు చెమటతో తడిసిపోయాయి. వాళ్ళు సరిగ్గా మునుపు వీధి కొళాయి వున్న చోటునే ఆ మొక్క పాతు తున్నారు.

''అక్కడ పాతుతున్నారేంట్రా?'' అని అడిగాను.

దానికి వాడు సీరియస్‌గా పోజు పెట్టి, ''మరేం, నాన్నా! దానికి నీళ్ళు పొయ్యక్కర లేదుగా'' అన్నాడు''

''కొళాయినీళ్ళన్నీదానికే.'' అందిపాపాయి.

నాకు నవ్వొచ్చింది. ''బావుంది.'' అను కుంటూ లోపలికి వెళ్ళాను.

''మనవాడి వనమహోత్సవం చూశారా?'' అంది, శ్రీమతి.

''ఆ!''అన్నాను.మెల్లగా ఆలోచిస్తూ. ఆ చెట్టు పెద్దదై, బోలెడు పూలుపూసి.పచ్చగా, ఇంటి ముందు కలకల లాడుతూ వుంటే ఎంత బాగుంటుంది. ఆ పూలు కోసుకోడానికి కూడా జనం ఎగబడుతారేమో.మళ్ళీ వీధిలో గోల పెరగచ్చు అనుకుని.ఒక చిన్న నిట్టూర్పు విడిచాను.



## హైద్రాబాద్‌లో గామా కిరణ పరిశోధన

గామా ఖగోళ శాస్త్రంలో సమిష్టి పరిశోధనల గురించి భారతీయ ఖగోళ శాస్త్రవేత్తలతో సంభాషణలు జరిపే నిమిత్తం సోవియట్ శాస్త్రవేత్తల బృందం ఒకటి అక్టోబరు మాసాంతంలో భారతదేశం వచ్చింది. ఈ బృందం నాయకుడు ప్రొఫెసర్ ఎ. యం. గాల్పెర్, డాక్టర్ ఆఫ్ సైన్సెస్ (భౌతిక, గణిత శాస్త్రాలు.)

"గామా ఖగోళశాస్త్రం సాపేక్షంగా యిప్పుడే ఎదుగుతున్న శాస్త్రం, అయినప్పటికీ ఖగోళ భౌతిక శాస్త్రానికి ఎంతో ఉపయుక్తమైన రంగం. ఇది మన పాలపుంత నుండి సూర్యగోళం నుండి, తదితర నక్షత్ర మండలాల నుండి ప్రసరించే "గామా" కిరణ ధార్మిక శక్తి వాతావరణంలోకి చొచ్చుకొని పోదు. అందువల్ల భూమి ఉపరితలం నుండి చాలా ఎత్తున, వాతావరణంలోని లేదా అంతరిక్షంలోని పైపొరలలోనూ దానిని గురించి పరిశోధన చేయాలి. అందువల్ల యీ తరహా పరిశోధనను ఎత్తున ఎగిరే బెలూన్ల నుండి గానీ లేదా కృత్రిమ ఉపగ్రహాల ద్వారా గానీ నిర్వహించవచ్చు" అని ఆ ప్రొఫెసరుగారు చెప్పారు.

"భారతీయ శాస్త్రవేత్తలు ఎక్స్-రేలనూ తదితర అంతరిక్ష ధార్మిక శక్తిని గురించీ దీర్ఘకాలంగా పరిశోధిస్తూ వున్నారు. దీనికి వారు హైద్రాబాద్ కేంద్రం నుండి ప్రయోగించబడిన ఎత్తున ఎగిరే బెలూన్లను ఉపయోగిస్తూ వున్నారు. సోవియట్ యూనియన్‌లో గామా ఖగోళ పరిశోధన స్పూత్నిక్‌ల సహాయంతో జరుగుతూ వుంది.

శాస్త్రవేత్తల మార్పిడి కార్యక్రమంలో భాగంగా, యీ రంగంలో సమిష్టి పరిశోధన జరపడం అవసరమని నిర్ణయించబడింది. సోవియట్ సాంకేతిక విజ్ఞానాన్ని, పరికరాలనూ ఉపయోగించుకునే అవకాశం భారతీయ శాస్త్రవేత్తలకు లభిస్తుంది. సోవియట్ శాస్త్రవేత్తలు ఎత్తున ఎగిరే బెలూన్లను ప్రయోగించడానికి హైద్రాబాద్ కేంద్రాన్ని ఉపయోగించుకొనే ఆసక్తి చూపు



**"మౌన" మూర్తి హువా**

ఎర్ర చైనా ప్రజాధినేతగా పదవీ స్వీకారం చేసిన హువా కువో ఫెంగ్‌ని పది లక్షల మంది జనం హర్షాతిరేకంతో అభినందించినప్పుడు కూడా — పై ఫోటో చూడండి — హువాగారు పెదవి విప్పలేదు. ఒక్క మాట అనలేదు. ఆ సభలో చైర్మన్ హువాని 'మావో' గారే తన వారసుడన్నారని ఇతర నాయకులు ప్రస్తుతించారు.

**అవీ — ఇవీ — అన్నీ**

తున్నారు. విషయమేమంటే అది భూమధ్య రేఖా మండలానికి చేరువుగా వుంది. అక్కడ భూమి విద్యుదయస్కాంత కేంద్రం బలంగా వుంటుంది'' అని ఆయన వివరించారు [సో. వా.]

**గుంటూరులో హిందీ 'సోగ్గాడు' బృందం.**

ఫిలింఫాన్స్ అసోసియేషన్, లేడీస్ రిక్రియేషన్ క్లబ్ కలిసి ఏర్పాటుచేసిన పరిచయ సమావేశం గుంటూరు లేడీస్ క్లబ్ ఆవరణలో జరిగింది. శ్రీ ఎం. ఎస్. ఆర్. ప్రసాదరావు అతిథుల్ని వేదికపైకి ఆహ్వానించారు. శ్రీమతి రామకుమారి ప్రార్థనా గీతంతో సభ మొదలైంది. ఫిలింఫాన్స్ అధ్యక్షుడు శ్రీ ఎం. వి. సుబ్బారావు [illegible] రామానాయుడు గుణగణాలను వివరించారు. గుంటూరు ఎస్. పి. శ్రీ వి. పి. వి. నాయర్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. లేడీస్ క్లబ్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి హేమానాయర్ నటీనటులను పుష్పహారాలం కృతుల్ని చేశారు. నటీనటులు జితేంద్ర, [illegible], [illegible] [illegible] [illegible] [illegible] సమస్కారాలతో ప్రసంగాలని ముగించారు. నిర్మాత రామానాయుడు మాట్లాడుతూ, సోగ్గాడు తమ 22 వ చిత్రం అని ప్రతి చిత్రాన్ని తెలుగులో తీసిన తర్వాతే ఇతర భాషల్లో తీస్తున్నామని, హిందీ సోగ్గాడు కూడా [illegible] కొంతభాగం తీస్తున్నామని, గుంటూరు శ్రీశైలం పరిసరాల్లో మిగిలిన భాగం చిత్రీకరణ జరుగుతుందని అన్నారు. అతిథులను [illegible] తర్వాత క్లబ్ కార్యదర్శి శ్రీమతి హేమలత వందన సమర్పణ చేశారు. (బి.వి)

## తొలి మహిళా కమాండర్

బార్బరా ఫెహాష్ అనే ఆమె భారత నౌకా దళంలో కమాండరు హోదాను పొందిన తొలి మహిళట. భారత నౌకా దళానికి చెందిన అశ్విని ఆసుపత్రి నౌకలో శిశు వైద్య కేంద్రానికి అధికారిగా పనిచేశారటామె. 1961లో నౌకా దళంలో చేరారట. ఆనాడు నౌకా దళంలో శాశ్వతోద్యోగం పొందిన తొలి మహిళ కూడా ఆవిడేనట!

## కుటుంబ నియంత్రణ ఆపరేషన్లలో రికార్డు

కుటుంబనియంత్రణ పథకంలో డాక్టరు ఎస్. ఆర్. పాటిల్ అనే ఆయన పదివేల వేసెక్టమీ ఆపరేషనులు చేసి ప్రపంచ రికార్డు స్థాపించారట. ఈయన బెల్గాంజిల్లాకు చెందిన బెండగెరె మెడికల్ సబ్ సెంటరులో పనిచేస్తున్నారట. హోన్నో అనే వూరిలో ఆయన ఒకే రోజులో 236 ఆపరేషనులు చేశారట. అంతేగాక గోకర్‌లో ఆయన పదమూడు రోజులలో 600 వేసెక్టమీలను, 800 ట్యూబెక్టమీలను చేశారట. వైద్యులే! వీరైనా వో బిరుదియ్యరాదీయన కీపాటికి!

### కుటుంబ నియంత్రణలో లాటరీ

ప్రొద్దుటూరులో వేసెక్టమీ ఆపరేషను చేయించుకున్న ప్రతి వందమందికి ఒక్కో లాటరీ ప్రారంభించి, అందులో బహుమతి, నెంబర్లొచ్చినవారికి ట్రాన్సిస్టరు రేడియోలు, దోవతులు, పంచలు, టార్చి లైట్లు ఇస్తామని ప్రకటించారట.

### ఆకులద్వారా తయారైన ఔషధం

కుటుంబనియంత్రణ పథకం కోసం దేశములో ఎవరి శక్తికొద్దీ వారు మందులను కనిపెట్టేస్తూనే! ఉన్నారు. లక్నో విశ్వవిద్యాలయానికి చెందిన జీవ రసాయనిక శాస్త్ర భాగ పరిశోధకులు వో రకం ఆకుల ద్వారా కుటుంబ నియంత్రణ సంభవిస్తుందని కనిపెట్టారట. ఈ ఆకుల ద్వారా తయారైన ఔషధ రాజాన్ని మొట్టమొదట వారు ఎలుకల మీద ప్రయోగం చేశారట. ఒక్కో మగ ఎలుకకు వో పది రోజులపాటు రోజుకో యాభయి మిల్లి గ్రాములు తినిపిస్తే అవి సంతానాన్ని కలుగజేసే శక్తిని కోల్పోయినా పోగొట్టుకున్నాయట. ఆ మందు ఇవ్వడం మానేసరికి మళ్లీ ఆ శక్తి వచ్చేసిందట వాటికి. ఈ మందువల్ల మగ ఎలుకలు సంతానాన్ని కలుగజేసే శక్తి కోల్పోయినా కామశక్తిని, మగతనాన్ని మాత్రం పోగొట్టుకో లేదట. మగ ఎలుక పోగొట్టుకోపోతే.... మగ మనిషి మాటో!

### ఇంకా పుడతారేమోనని...

జమ్ము ప్రాంతానికి చెందిన సరిహద్దు ప్రాంతంలోని వో గ్రామ పౌరుడు కుటుంబనియంత్రణ శిబిరానికి వెళ్లి అయ్యా నాకు స్టెరిలైజేషను చెయ్యండన్నాడట. అయ్యా తమకు పిల్లలెంతమందీ అనడిగితే పదిహేను అన్నాడట. శిబిరంవారాశ్చర్యపడి తేరుకునేలోగానే అవునండి. నాకు పదిహేనుమంది పిల్లలండీ. ఇంకా పుడతారేమో నని భయం. కనుక.... అన్నాడట! వోర్నీ!

## ఫాలాక్షుని డైరీ

### 1975-76 లో తంతి తపాలా శాఖ సాధించిన విజయాలు

టెలిఫోన్ ఎక్ఛేంజిలో నిర్వహణ శక్తిని 1.58 లక్షల లైన్లకు పెంచడం జరిగింది.

రికార్డు స్థాయిలో 1.38 లక్షల కొత్త టెలిఫోన్ కనెక్షన్లు ఇవ్వడం జరిగింది.

టెలెక్స్ ఎక్ఛేంజీలలో అదనంగా 2,500 లైన్లు పెంచడం ద్వారా వీటి శక్తిని 16,370 లైన్లకు పెంచడం జరిగింది.

డిమాండ్ ట్రంక్ సర్వీసులలో 112 రూట్లు చేర్చబడ్డాయి.

ఎస్. టి. డి. సర్వీసులో 65 కొత్త రూట్లు చేర్చడం జరిగింది.

4,700 లైన్లతో కూడిన ట్రంక్ ఆటోమాటిక్ ఎక్ఛేంజి పరికరాలు నెలకొల్పడం జరిగింది. 448 మాన్యువల్ ట్రంక్ బోర్డులు కొత్తగా ఏర్పాటుచేయడం జరిగింది.

3,500 రూట్ కిలో మీటర్ల మైక్రోవేవ్ వ్యవస్థలు, 360 కిలో మీటర్లకో ఏక్సిల్ కేబిల్ వ్యవస్థలు కొత్తగా చేర్చడం జరిగింది.

1,005 కొత్త టెలిగ్రాఫ్ ఆఫీసులు 592 దూర ప్రాంతపు పబ్లిక్ కాల్ ఆఫీసులు తెరువబడ్డాయి.

### జీపుకి బలైన కార్పొరేషన్ అధికారి

హైదరాబాదు కార్పొరేషను లెక్కలు తనిఖీ చేసే అధికారి రామారావు అనే ఆయన గుంటూరు నుంచి హైదరాబాదు బస్సులో వచ్చి, మలక్‌పేట వద్ద బస్సు దిగి (25వ తేది) రోడ్డు దాటుతుండగా జీపొకటి రయ్యిన వచ్చి ఆయన్ని ఢీకొన్నదట. ఆసుపత్రికి తీసుకువెళ్లే దారిలో ఆయన చనిపోయారట

### నిద్ర యంత్రం!

నిద్ర పట్టనివారికొచ్చే నిద్ర వచ్చేట్టు చేసే యంత్రాన్నొకదాన్ని అరలక్ష రూపాయల ఖరీదుతో బెంగుళూరు ఎలక్ట్రానిక్స్ అండ్ రాడార్ డెవలప్‌మెంటు ఎస్టాబ్లిష్‌మెంట్ వారు తయారు చేశారట. ఈ పరికరం రోగి శరీరానికి విద్యుత్ శబ్దతరంగాలను ప్రసారం చేసి నిద్ర పట్టేట్టు చేస్తుందట— వాయబ్బ నిద్రపట్టడానికెంత సైన్సు! పట్టించడానికి ఎంత ఖర్చు —

### దారి దోపిడీ

గుత్తి— అనంతపురం రోడ్డుకు దొంగల ముఠా కాపలా కాస్తూ, వచ్చిపోయే వాహనాలను శక్తికొద్దీ, యుక్తికొద్దీ దోచుకుంటోందట. ఈ ముఠాలో సుమారు నలభయి మందున్నారట. గత 19వ తేదీన వో లారీని ఆపు చేసి లారీలోనివారి డబ్బూ, చేతి గడియారాలు కూడా ఒలుచుకున్నారటీ ముఠావారు.

## ఉత్తరాలు

(5వ పేజీ తరువాయి)

### వసూళ్ల చక్రవర్తి !

'వసూళ్ల చక్రవర్తి' విషయమై రామారావు గారి, శోభన్‌బాబు గారి అభిమానుల వివాదం చూస్తుంటే నాకు నిజంగా నవ్వువస్తుంది. నిజానికి శ్రీనివాస్‌గారు చెప్పినట్లు రామారావుగారుగానీ, జి. సురేష్‌గారు చెప్పినట్లు శోభన్‌బాబుగారుగానీ వసూళ్ల చక్రవర్తి కానేకాదు. తెలుగు చలనచిత్ర రంగంలో నాటికి, నేటికి ఏ నాటికీ ఏకైక వసూళ్ల చక్రవర్తి అగ్రనటుడు ఎవర్‌గ్రీన్‌హీరో నటసామ్రాట్ శ్రీ నాగేశ్వరరావుగారు మాత్రమే. నటసామ్రాట్ నాగేశ్వరరావుగారి 'దసరాబుల్లోడు'కు వచ్చిన కలెక్షన్లు తెలుగు సినీరంగంలో ఇంతవరకు ఏ హీరో చిత్రానికీ రాలేదంటే అతిశయోక్తి కాదు. నేటికీ నాగేశ్వరరావుగారి 'దేవదాసు' వసూళ్లలో కొత్త చిత్రాలను అధిగమిస్తోందంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నాగేశ్వరరావుగారి 'బాలరాజు' 'విప్రనారాయణ' 'అనార్కలి' 'శ్రీలక్ష్మమ్మ' 'తెనాలిరామకృష్ణ' 'ప్రేమనగర్' మొదలైన ఎన్నో చిత్రాలకు ఆ సమయములలో ఏ ఇతర హీరో చిత్రానికి రానన్ని కలెక్షన్లు వచ్చిన నిజం జగమెరిగిన సత్యమే. కావున వసూళ్ల చక్రవర్తి అంటే నాగేశ్వరరావుగారు మాత్రమే ఇతరులెవ్వరు కానేకాదు. కావున నాగేశ్వరరావుగారి విరుద్ధమైన వసూళ్ల చక్రవర్తి విషయమై వివాదంలోకి దిగి నగుబాటు కావద్దని ఇతర నటుల అభిమానులకు నా మనవి.

ఎస్. మురళి, (గుంటూరు.)









Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

పురుగులు మీరు
అనుకొన్న దానికంటె
ఎంతో త్వరగా పెరుగుతాయి

# ఫినిట్‌ను
# మీ ఇంట్లో
# నియమంగా చిలికి
## మీ ఇంట్లో పురుగులను
## సురక్షితంగా,
## నిశ్చయంగా హతమార్చండి

**ఫినిట్ క్రిమిసంహార ప్రణాళిక**
**ఫినిట్ ఉపయోగించే విధానం**

**ఎగిరే పురుగులు**

ఈగలు, దోమలు, చిమ్మెటలు, మశకములు, కందిరీగల విషయంలో, గదిని మూసివేసి మందు గదంతా పొగలా నిండిపోయే వరకూ చిలకండి. 15 నిమిషాల తరువాత తలుపులు తెరవండి.

**ప్రాకే పురుగులు**

బొద్దింకలు, చీమలు, సాలెపురుగులు, తృట్లు పురుగులు, జెర్రెలు, కొణజులు, 'సిల్వర్ ఫిష్‌ల' విషయంలో—వీలయినంత వరకు పురుగుల మీద నేరుగా చిలకండి అవి రాగానే అన్నిచోట్లా, తూములూ, మురుగు కాల్వల దగ్గర కూడా బాగా చిలకండి. వారానికి ఒకటి రెండుసార్లు చిలకండి. గుర్తుంచుకొనండి. ఫినిట్ డబ్బా మీద ఇంతకంటె హెచ్చు వివరాలు ఉంటాయి వాటిని తప్పకుండా చదవండి

ఈ విషయం కూడా గుర్తుంచుకొనండి. పురుగులు కేవలం చిమ్మల్ని వేధించడమే కాదు జబ్బులను కూడా వ్యాపింపచేస్తాయి! అందుచేతనే ఇంట్లో పురుగులను నాశనం చేయండి. వీటిమీద చిలకండి వాటిని చంపే ఫినిట్.




ఫినిట్ ఒక వైజ్ఞానిక ఫార్ములాతో తయారు చేసిన బహుళ విధోపయోగ క్రిమినాశిని ఇది ఎంతో శక్తివంతం కావడం మూలంగా, ఇది తగలగానే ఈగలు, దోమలు, బొద్దింకలు, నల్లులు మొదలైన పురుగులు వెంటనే చచ్చిపోతాయి.

అందువల్ల, నియమంగా ఫినిట్ చిలికి మీ ఇంటిని పరిరక్షించుకొనండి.

## దోమలు, ఈగలు, బొద్దింకలు, నల్లులపై
## **ఫినిట్ చిలకండి వాటిని నాశనం చేయండి!**
## సురక్షితంగా నిశ్చయంగా హతమార్చండి.




హిందుస్తాన్ పెట్రోలియం కార్పొరేషన్ లి